# దశకుమారచరిత్ర

విద్వాన్, యం. వి. ఆర్. కృష్ణశర్మ,
బి. ఓ. యల్.





# దశకుమార చరిత్ర

రచన:

విద్వాన్, యం. వి. ఆర్. కృష్ణశర్మ,
బి. వో. యల్.

జయంతి పబ్లికేషన్సు,
బిసెంట్‌రోడ్డు :: విజయవాడ-2.

# రాజవాహనుని కథ

పూర్వము పాటలీపుత్రము సర్వసంపదలతోఁ దులఁ దూఁగుచుండెడిది. దానిని రాజహంసుఁడను నృపాలకుఁడు పాలించుచుండెను. అతఁడు ధర్మపరుఁడై, ప్రజలఁ గన్నబిడ్డల వోలెఁ గాపాడుచు, దశదిశలఁ బ్రఖ్యాతిఁజెందెను. బంగారమునకుఁ గాంతిగలిగినట్లు నా రాజహంసునకు వీరత్వము, నద్దానికిఁ దోడు నుదారత్వము గలిగి సాటి రాజులయందుఁ గీర్తి గల్గి యుండెను. ఆ నృపాల పుంగవునకు వసుమతీదేవి యను కాంత మహారాణియై సర్వ సౌఖ్యములఁ గలిగించుచుండెను. ఆ దేవేరియు మహా పతివ్రతామణిగా వాసిఁగాంచెను. అబ్భూపాలునకు ధర్మపాల, పద్మోద్భవ, సితవర్మ లను మంత్రులు గలరు. ఆ సచివత్రయ మతిప్రజ్ఞానిధులై, రాజ్య కార్యములఁ జక్కఁగా జేయుచు, నృపాలున కత్యంత ప్రేమ పాత్రులై యుండిరి. ధర్మపాలునకు సుమంత్రుఁడు, సుమిత్రుఁడు, కామపాలుఁడు అను మువ్వురు పుత్రులు గలిగిరి. వారు మువ్వురు విద్యాభ్యాసము ముగించి, రాజ్యతంత్ర ప్రవీణులై యుండిరి. కాని సుమంత్రుఁడు, సుమిత్రుఁడు పూర్వ సుకృతవశమున విజ్ఞాననిధులయి, రాజ్యకార్యములందుఁ దండ్రికిఁ జేదోడువాఁదోడుగా నుండిరి. మూఁడవ వాఁడయిన కామపాలుఁడుమాత్ర మట్లుగాక భోగలాలసుఁడై, నిరంతర కామవ్యాపార పారీణుఁడై సంచరించుచుండెను. ధర్మపాలుఁడు దన కుమారుని వర్తనమును జూచి మనస్సు

నందు మిక్కిలిగా ఖిన్నపడుచు నతని నెనో్నవిధముల నూఁదలిం చెను గాని యదియెల్ల బూడిదఁ బోసిన పన్నీరయ్యెను. సుమంత్రుఁడు, సుమిత్రుఁడు దన దమ్ముని కనేక ప్రబోధనములఁ గావించిరి. అవి యతనిపట్ల సముద్రమునఁ బడిన వానయట్లయ్యెను. కామపాలుని వర్తనను రాజహంసునకుఁ దెలియవచ్చెను. ఈ విషయము నెఱింగి కామపాలుఁడొక్క యర్ధరాత్రంబున నెవ్వరికిఁ దెలుపక నెటకో పోయెను. రెండవ మంత్రియయిన పద్మోద్భవునకు, సుశ్రుతుఁడు, రత్నోద్భవుఁడను నిరువురు పుత్రులు గలిగిరి. వారు విద్యావంతులై, రాజ్యకార్యముల నడుప సమర్థులై యుండిరి. కాని రత్నోద్భవుఁ డట్లుమాత్రముగాక ధనార్జనాసక్తుఁడయి, పద్మోద్భవుఁ డెంత చెప్పినను వినక విదేశ వ్యాపార మొనరింప సంసక్తుఁ డయ్యెను. ఆతఁడొక సుముహూర్తంబున సముద్ర యానంబునకై, సముచిత పరివారంబుతో, వలయు సామగ్రితో బయలుదేరి పోయెను. సుశ్రుతుఁడు దండ్రికిఁ దోడ్పడుచు, రాజ్యాంగంబులందుఁ బ్రతిభా విశేషంబులఁ జూపుచుండెను. మూఁడవ మంత్రియగు సితవర్మకిరువురు నందనులు జనించిరి. వారు విద్యా వివేకంబుల నప్రతిమాన ప్రతిభావిశేషంబుల సంపాదించిరి. కాని యందు ద్వితీయుఁడు సత్యవర్మ మాత్ర మాధ్యాత్మిక చింతనలంబడెను. మాయా పూరితమయిన యీ జీవితమునకు భగవత్సేవయే పరమార్థమని యాతఁడు విశ్వసించెను.

బుద్బుద ప్రాయమయిన యీ దేహమునకు నీ రాజ్యాంగ భోగంబులెల్ల వ్యర్థంబులని యాతఁడు దలపోసెను.

జననీ జనకులు, పత్నీసుతాదులు, కేవలము ఋణానుబంధము లని యాతఁడు నిశ్చయించెను. పాపభూయిష్ఠమయిన శాశ్వత మగు, నరజన్మకు భగవద్ధ్యానము గలిగినచోఁ బునర్జన్మ కలుగుట కవకాశ ముండదని యాతఁడు నిర్ధారణ గావించుకొని, భోగంబులఁ దృణప్రాయంబుగా భావించుకొని తీర్థయాత్రార్థమై, యర్ధరాత్రి సమయంబున నిల్లును వీడి వెడలిపోయెను.

కాలము బలీయమయినది. సుఖదుఃఖములు పుట్టుఁ జావులందు నిబిడీకృతమై యున్నవి. అందుచేత మరణ సమస్యకు రాజు పేదయను భేదము లేదు. క్రమవశమున మేధావులయిన ధర్మపాల, సద్భోద్భవ, సితవర్మ మంత్రులు ముగ్గురు మరణించిరి. రాజహంసుఁడు దన మంత్రులట్లు గతించుట మూలమున సంతాపిల్లి, వారి పదవులను తత్పుత్రులకే యొసఁగి యెప్పటియట్లు రాజ్యము గావింపుచుండెను. వారి కుమారులు గూడఁ దండ్రులువోలె సమర్థులయి, యెట్టి కళంకమును రాజ్యంబునందుఁ జొరనీక, నృపాల సత్తమునకుఁ దోడ్పడుచుండిరి. సమర్థుఁడయిన నృపాలునికి రాజ్యతంత్ర ప్రవీణులయిన మంత్రులు లభించినప్పుడా రాజ్యము సుభిక్షవంతంగా నుండు ననుటలో సందేహము లేదుకదా!

ఆ కాలమున మాళవదేశమును మానసారుడను రాజు పరిపాలించుచుండెను. అతఁడవక్ర పరాక్రమ శోభితుఁడు. ప్రజాభిమానమును గలిగి, రాజ్యమును జక్కఁగాఁ బరిపాలింపుచుండెను. ఆ కాలమునఁ బ్రజలు నిత్యకళ్యాణము పచ్చలతోరణముగా నుండి సుఖవంతులై, యనంత సంతతోత్సవముల మునిఁగి తేలుచుండిరి. క్షాత్రధర్మము ననుసరించి రాజహంసుఁ

డా మాళవదేశముపైకి దండెత్తెను. తలవని తలంపుగా జరిగిన యీ యుద్ధమునకు మానసారుఁడు మనంబున నధైర్యపడక, రాజహంసునితో నెదుర్కొనెను. మాళవసైన్యంబులు పాటలీపుత్ర సైన్యంబులతో ఢీకొని, ప్రాణభయం బొకియింత లేక, పోరాడఁజొచ్చినవి. కాని విధి బలీయమయినప్పు డెంతటి బలశాలియేని, ప్రజ్ఞావంతుఁడేనిఁ దలవొగ్గక తప్పదు. కాలవశమున రాజహంసుని సేనాని మానసారుని రథమును తుత్తునియలుగాఁ గావించెను. అది యా రాజపుంగవుని సైన్యము గాంచి భయపడి వెనుకకు మరలఁజొచ్చెను. అట్లు దుస్థితినందున్నను మానసారుఁ డొకియింత చలియింపక నిలిచి పోరాడఁజొచ్చెను. కాని యెంత పోరాడినను రాజసింహుని సైన్యము ప్రబలమయి, విజృంభింపఁజొచ్చెను. ఎట్టకేలకు మానసారుఁడు రాజసింహునకు లొంగిపోయెను. అంత నా రాజసింహుఁడతని పరాక్రమంబునకు మనంబలరి, తిరిగి యతనిని రాజుగానే యేర్పాటు గావించి గౌరవించి వీడ్కొలిపెను.

మానసారునకు రాజ్యము స్వీకరించినను, రాజసింహుఁడు గౌరవించినను, నది యవమానకరముగాఁ దోచెను. సూర్యకాంతము ప్రాణము లేనిదయినను, సూర్యకిరణములు సోకినంతనఁ బ్రజ్వరిల్లునట్లు, రాజసింహునిఁ దలంచుకొనినంతన మానసారునకుఁ దీవ్రకోప ముదయింపుచు నుండెను. ఎట్లయినను బ్రతీకారము గావింప నతఁడు మార్గంబుల నరయఁజొచ్చెను. తుదకాతఁడు దపస్సుచేతఁబరమేశ్వరుని మెచ్చించి, తత్కృపాబలిమిచే రాజసింహుని గెలువ నెంచెను.

పురుషకారముచేత నెట్టి కార్యములనయిన సాధింప వచ్చునుగదా! మానసారుఁడు రాజ్యభారమును మంత్రిశేఖరున కప్పగించి, తపోవృత్తి నవలంబించుటకు వలయు వేషంబులం దాలిచి, ఘోరారణ్యంబునఁ జేరెను. అంత నా భూకాంతుఁడు నిష్ఠాగరిష్ఠుఁడై పరమేశ్వరునిఁ గూర్చి ఘోర తపంబుఁ గావింపఁ దొడఁగెను. ఆ తపోగ్నికి నెల్ల లోకంబులు కంపింపఁదొడఁగినవి. దేవతలెల్ల పరమేశ్వరునిఁ జేరి సాష్టాంగ దండప్రణామంబులాచరించి మానసారుని తపోవృత్తాంతమును నివేదించిరి. సహజకారుణ్య మానసుండు, సర్వజ్ఞుండునగు శంకరుండు మానసారుని కథనారసి దేవతలకు సెలవిడి యా నృపాల మౌళికిఁ బ్రత్యక్షమై 'వత్సా! నీ యాత్మవిశ్వాసమునకు, నీ భక్తికిని గడుంగడు మెచ్చితిని. నీయిచ్చవచ్చిన వరమును బ్రసాదింతు' నని పలికెను. అంత నా రాజమౌళి, రాజమౌళిఁ గాంచి సంతోష విభ్రమంబులం బెనఁగొన నతిభక్తి సంయుక్తుఁడై సాష్టాంగ దండప్రణామంబులాచరించి 'శశాంక మౌళీ! నావంక కృపఁబూని యిటులరుదెంచి నీ భక్తవరద ఖ్యాతిని నినుమడింపఁ జేసికొంటివి. నిన్ను నమ్మి సేవించు భక్తులకు నీవు ముంగొంగు పసిఁడివికదా! నాయందుఁ గరుణఁబూని, సమరమునందు నజేయత్వము ప్రసాదింపు' మని కోరెను. అంత నా శూలిభూకాంతుఁడు వాంఛించినట్లు ప్రసాదించి, యొక గద నొసంగి, యంతర్హితుఁడయ్యెను.

మానసారుఁ డత్యంత ముదంబునొంది, తిరిగి స్వారాజ్యంబునకుంజని రాజసింహునిపై యుద్ధమునకు సన్నద్ధుఁడగుచుండెను. ఈ విషయము చారుల మూలమున రాజసింహుం

డెటింగి సేనాపతులకు, మంత్రులకుఁ దెలియఁజేసెను. అంత నా మానసారుఁడు దన సైన్యమును గైకొని, పాటలీపుత్రమును ముట్టడించెను. ఉభయ సైన్యములు భీకరముగ నెదుర్కొని, ఘోరయుద్ధమును గావింపఁజొచ్చినవి. రాజసింహుఁడు మానసారుఁ డుభయు లెదుర్కొని సమరము సలుపుచుండిరి. ఉభయులు వీరులగుటచే జయసాధన మెవరికిఁ గష్టసాధ్యముగా నుండెను. కడకు మానసారుఁ డీశ్వర ప్రసాదితమయిన గదను నా రాజసింహునిపైఁ బ్రయోగించెను. ఆ రాజసింహుఁ డది కాంచి, భీకర బాణంబుల నద్దానిపై సంధించెను. కాని దైవబలమును మానవబలము సాధింప లేదుగదా! ఆ గదను నా బాణములు దుత్తునియలుగఁ జేసినప్పటికి, నా తునకలా రాజసింహుని సారధికిఁ దగులుటచే నతఁడు నిహతుఁడయ్యెను. సారధి యట్లు మృతిఁజెందుటచే నశ్వంబులకుఁ బట్టుఁదప్పి, రథంబును సమరసీమనుండి తప్పించి, యతివేగంబున నొక మహారణ్యంబునకుఁ గొనిపోవఁ జొచ్చెను.

రాజు మరణించెనను కోలాహలంబు నధికంబగుటచే మానసారుడు రాజసింహుఁడు మరణించెనని యూహించి, విజయ గర్వంబునఁ బాటలీపుత్రమును నాక్రమించెను.

అంతకుముందు రాజసింహుని సచివులు యుద్ధ పరిస్థితులు గమనించి విజయసాధనను శంకించి, మహారాణిని గుప్తమార్గంబున, వింధ్యాద్రి కాల వనంబులకు సురక్షితంబుగఁ జేర్చిరి. పిదప వారు మానసారుని నెదుర్కొనిరి. ప్రజ్ఞానిధులు, శూరులు, బాహుబల శోభితులయిన యా మంత్రివరు లెంత పోరాడినను, మానసారుని శక్తి యజేయమయి,

జయించుటకు వలనుపడకుండెను. కాలము వక్రించినప్పుడు మానుషశక్తులు వ్యర్థంబులగుట సహజంబులు గద!

అంత నా మంత్రులు సమయంబు గాంచి, యా యుద్ధభూమినుండి నిష్క్రమించి, మహారాణినిఁ గాంచుటకుఁ జనిరి. అట నామెను గాంచి సమరవృత్తాంతము సర్వమును నివేదించిరి. అప్పు డా మహారాణి యా విషాద గాధను నెఱింగి, వ్యథను జెందెను. మంత్రు లెంతయో యూరడించిరి. అంతఃపురంబున మహాభోగంబు లనుభవించిన మహారాణి నేఁడు భీకర కాననంబున నివాసంబు గావింపవలసి వచ్చినది కదా! యని ఖేదపడి 'మహారాణీ! మీకు వచింపవలసిన వారము కాదు. కాలము వ్యతిరేకించినప్పుడు పురాణ పురుషుల కేని భంగపాటుఁ దప్పదు. ఆ సమయంబుననే ధైర్యము వహించుట మానవలక్షణమని యెల్లరెఱింగినదే కదా! జ్యోతిర్మయ మయిన యీ కాలంబునం దొకదాని వెంట నొకటి రాఁగలుగును కదా! అయినను మహారాజు సమరమునపాలు కాలేదుకదా! మానవజీవిత మాశాపూరితము. అందుచేత ముందుముందుఁ గాలనిర్ణయమునకు వేచియుండుటయే కర్తవ్య' మని బోధించిరి. కాని మహాపతివ్రతయగు నా మహారాణి నా పలుకులు స్వస్థచిత్తురాలుగాఁ జేయ లేకపోయినవి. ఆమె యప్పటికి నిండు చూలాలగుటచే నాకు యేదైన సాహసమున కొడంబడఁ గలదేమో యని సచివులు జాగరూకత వహించియుండిరి. అంత నాటి రేయి, ఆ మంత్రులు గాఢ నిద్రావేశ పూరితులయి యుండిరి. కాని మహారాణికి మాత్రము రాజ వియోగంబు

వలని సంతాపంబు వెల్లుబికి చినుపులై చిమ్ములై జాలై తరం గంబులై ప్రవహించినది. జీవితముపై నాశామోహము లంత రింపఁ జేసికొనినది. దుర్భరమయిన యీ జీవితంబును గొన సాగుట యాతనావహముగా నిశ్చయించుకొనెను. మరణము క్షణకాల బాధావహము. కాన నదియే శరణమని భావిం చెను.

అట్లా రాణీ వసుమతీదేవి దృఢ నిశ్చయపరురాలయి, యీ గాఢాంధకారంబున బయలుదేరెను. ఆ క్షణంబున కామె వామనేత్రం బదిరెను. ఈ శుభనిమిత్తం బేమో యని సందేహించి, మరల మనస్సును గుదటబర్చుకొని, కఠిన పాషాణావృతమయిన యీ యరణ్యమునందుఁ బోవుచు, నొక బూరుగు వృక్షముకడకుఁ జేరెను. ఆ వృక్షమున కురిఁ బోసికొని మరణించుటయే యామె నిర్ణయించుకొనెను. అంతటఁ దత్కృత్యమున కుద్యుక్తురాలయి "పరమేశ్వరా! దీనావనశరణ్యా! నీ లీలావిలాసము వర్ణింప నసాధ్యము కదా! క్షణభంగురమున నీ మాయ జొన్పించి సుఖవంతులను దుఃఖ స్వాంతులుగఁ జేయుదువు కదా! రాజ భోగంబుల ననుభవించు మహారాజు నే కష్టంబులఁ బాలు గావించితివో కదా!" యని విలపించుచుండెను.

దైవవిచిత్ర మనూహ్యమయినది. ఆ వృక్షసమీపమున రాజహంసుని రథము నిలిచియున్నది. అట్లామె విలపించు చుండ నా యార్తనాదమా భూధవుఁడాలించి యది తన వసు మతీ కంఠస్వరముగా గుర్తించెను. వెంటనే యా భూజాని రథము దిగి, యా ధ్వనివచ్చిన దిశఁబట్టి చూడ, నటకు దాపు

ననే యున్నట్లు ఊహించెను. ఖడ్గమాత్ర సహాయుండై యామెను రక్షించుటకు వచ్చెను. మహారాణి వసుమతీదేవి, యా బూరుగుశాఖకుఁ దన చేలాంచలమును దగిలించి యురిఁ బోసికొన నుద్యుక్తులగుచున్న తఱి 'మహారాణీ! ఆగుమా గుము. కాలవశమునఁ గలిగిన మాపదలకుఁ బ్రాణత్యాగము నకు బాలుపడఁ దగునా? ఆత్మహత్యకుఁ దోడుగా భ్రూణ హత్యకూడఁ గావించుట ద్విగుణీకృత పాతకముగదా, యని యాచేలాంచలమును దనకత్తితో నఱికెను. అంతట మహారాణి దన భర్తయగు రాజహంసుని గుర్తించి, తత్పదములకుఁ బ్రణుతిఁగావించెను. అమ్మహారాజామెను లేవఁదీసి కౌఁగ లించుకొనెను. పిదప నా మహారాణి యావద్వృత్తాంతమును మహారాజునకుఁ దెలియఁజేసెను. అంత వారలిరువురు గలిసి మంత్రులున్న స్థలంబునకుఁ జనుదెంచిరి.

అట మంత్రులు మేల్కాంచి మహారాణిని గానక విషాదావృతచిత్తులై, యా గాఢతమంబునఁ గింకర్తవ్యతా మూఢులయి యుండిరి. అట్టి సమయంబున మహారాజు, వసు మతీదేవి యుతుండై యటకు వచ్చెను. సూర్యోదయంబున పద్మంబులట్లుగా, సచివులు వికసిత వదనారవిందులై మహా రాజునకు నమస్కారంబులను గావించిరి. అంతట నృపతి వారి నభినందించెను. అమాత్యులు జరిగిన వృత్తాంతమును సమస్త మెఱింగించిరి. నరపతికూడ సమరమున జరిగిన విషయమును వారలకుఁ దెలియఁజేసెను. ఇంతలోఁ బాటలీపుత్రాధిపతులకుఁ గష్టములువదలి. సుఖములు గలుగఁ బోవుచున్నట్లు, దిశ లందుఁగ్రమ్మిన చీకటులెల్ల బాయఁదొడఁగెను. ప్రకృతి గర్భ

మున విశ్రమించిన సమస్త జీవులు మరల మేలుకొనఁ జొచ్చి నవి ఇంతలోఁ గొందఱు మునిశిష్యు లా ప్రాంతమునుండి పోవుచుండిరి. ఆ ప్రాంతమున వామదేవ మహర్షి యాశ్రమము కలదని వారి మూలంబున మంత్రులెఱింగి, యటకుఁ బోవుటకుఁ బ్రభువును బ్రోత్సాహ పఱచిరి.

వామదేవ మహర్షి యతి పవిత్రుఁడయిన మహర్షి. అతఁడు సర్వకాల సర్వావస్థలయందుఁ దపోధ్యాననిమగ్నుఁడై యతి మహిమోపేతుఁడయ్యెను. రాజహంసుఁడు, మహారాణి, మంత్రులతో దర్శించెను. వారెల్లరా యతిపుంగవునకు నతి భక్తితో సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించిరి. అత్తాపసి వీరినెల్లర దీవించి, తన దివ్యదృష్టిచేతఁ దెలిసికొని సముచిత స్థలంబులఁ గూర్చుండ నియోగించెను అమ్మహర్షి యమ్మహీ జానినిఁ గాంచి 'రాజసింహా! నీ వృత్తాంతంబెల్ల నాద్యంతం బుగా నెఱిఁగితిని. గడచినదానికి వగవకుము. విధి బలీయ మయినప్పుడట్టి విపరీతములు జరుగుట సహజమయిన విష యము. నీకు ముమ్మాముఁ జక్రవర్తి కాఁగల నందనుం డుద యింపఁగలఁడు. మీ భావి జీవితముకూడ సుఖయశోవంత మయినదే! కాన సందాఁక కొండలంబు డెందంబున నవలి, యిందే యెల్లకుండుట చాల క్షేమకరమ'ని నుడివెను.

అమ్మహీపాలుఁ డమ్మహర్షి పలికిన పలుకుల కానం దించి. కృతజ్ఞతాపూర్వక వదనంబులతోఁ దామందుండుట కంగీకరించెను. మహర్షి సానుభూతి వాక్యంబుల మూలంబు గను, రాజసింహుఁడు, మంత్రులు, వసుమతీదేవి స్వాంతంబు నందుఁ గొంతనుపశాంతి గలిగియుండిరి. మంత్రులు దమ దమ

పెట్టణంబును గుప్తమార్గంబునం బిలిపించుకొని యందు నివసింపుచుండిరి. ఇట్లుండ నొక శుభముహూర్తంబున వసుమతీదేవి, మహేంద్రుగనిన యదితివోలె, గుమారునిగనిన పార్వతిచుట్లు సర్వలక్షణ సంక్షోభితాంగుఁడైన యొక కుమారునింగని రాజిచ్చెను. అబ్బాలునకు వామదేవాశీర్వచనానుమతంబుగ రాజసింహుఁడు రాజవాహనుఁడని నామకరణము గావించెను. ఆ పసిబాలుని జూచుకొనుచు రాజసింహ, వసుమతీదేవు లత్యంతానందమున మునిఁగి తేలుచుండిరి. అచ్చటనే, మంత్రివర్యుఁడయిన సుమతి సతి ప్రసవించి యొక పుత్రునిఁగనెను అబ్బాలునికి నమ్మహర్షి ప్రమతియని పేరిడెను. సచివసత్తముఁడయిన సుమంతుని పత్ని యొక పుత్రునిఁ బ్రసవించెను. అత్తాపసి యబ్బాలునకు మిత్రగుప్తుఁడని నామంబిడెను. అమాత్య శ్రేష్ఠుఁడయిన సుమిత్రుని యర్ధాంగి, యొక బాలునిఁగనెను. అమ్మౌని యబ్బాలునకు మంత్రగుప్తుఁడను నామధేయంబిడెను. సచివసత్తముఁడయిన సుశ్రుతిని జాయ ప్రసవించి యొక బాలునిఁ బ్రసవించెను. అబ్బాలునకు మునివర్యుఁడు విశ్రుతుఁడను పేరుపెట్టెను. ఇట్లే నలుగురు మంత్రిపుత్రులు, రాజపుత్రుఁడు శుక్లపక్షపు చంద్రునివలె వృద్ధిఁజెందుచు బాల్యక్రీడలందు, దలిదండ్రులకుఁగల సంతాపమును బోఁగొట్టుచుండిరి.

మిథిలానగరమును బరిపాలించుచుండిన ప్రహారవర్మ రాజహంసుని యాప్తమిత్రుఁడు. మానసారుఁడు మరల రాజహంసునిపై యుద్ధమును జేయుటకు రాగ నతని నెదుర్కొనెను. బలశౌర్యములు గలిగిన ప్రహారవర్మ మానసారునితోఁ

బోరి, యోడిపోయి, స్వదేశమునకుఁ బత్నీయుతుఁడయి, సము చిత పరివారముతో బయలుదేరెను. ఒక్క భీకరారణ్యమును వారు సమీపించునప్పటికి నలుదిశలఁ జీకటిగ్రమ్మెను. అందు చేత వారొక విజన ప్రదేశమును జూచుకొని యందు విశ్ర మించిరి. అంత నిశీథిసమయంబున ముష్కర సమూహంబు హఠాత్తుగా రాజుపైఁ బడిరి. అంత నా ప్రహారవర్మ మేల్కని వారి నెదుర్కొనెను. ఆభూపతిసతి, దాది యీ భీకర సంకుల సమరమును జూచి భయపడి, యా చీకటియందే పథమును గానక మార్గ్రోవఁ జొచ్చిరి. దాది రాజపుత్రుల నిరువు రను గైకొని పోఁదొడఁగెను. కొంతదూరము బోవునప్పటికి నొకసింహమెదురై భీభత్సము గావించెను. ఆ దాది యది చూచి భయపడి మూర్ఛఁజెందెను. ఆమె హస్తంబునందున్న రాజపుత్రు లిరువురు భీతిఁజెంది కెవ్వున కేకవైచెను. ఆ యార్తనాదమును విని కిరాతకుం డతివేగంబున నచ్చటకుఁ జనుదెంచి, యా సింగమును సంహరించి యా బాలురను గైకొని పోయెను. అంత నా దాది కొంతసేపటికి మూర్ఛ దేరి, రాజనందనులను గానక పరితపించుచుఁ ద్రోవఁ గాన కుండెను. ఎట్లో యామె తెల్లవారుదనుక నోపికబట్టి, రాజ సుతులను వెదుకఁజొచ్చెను. అంతట నా దాది యా సమీ పముననున్న పల్లెకుఁజేరి, యందా కిరాతకుని గృహమున నున్న యిరువురు బాలురనుగైకొని, యతనికిఁ గృతజ్ఞతఁదెలిపి మహారాణి కడకు దిరిగి యటకురాఁగ నామె కనఁబడక పోయెను. అప్పుడా దాదిని వెదుకుచు, వామదేవ మహర్షి యాశ్రమమునకుఁ జేరెను. అటనున్న రాజహంస వసుమతీ

దేవులను గాంచి, యానంద సంభ్రమాశ్చర్యంబులం బెనం గొన, వారికిం బ్రణతిం గావించి, జరిగిన వృత్తాంతం బెల్ల నివేదించి, యా రాజనందనద్వయమును నప్పగించెను. రాజదంపతులా రాజనందనులను గైకొనిరి. తమ స్నేహితుని పుత్రులగుటచేత వారియందు మిక్కిలి యనురాగ ముదయించెను. అంతట నా భూకాంతుండా యిరువురు బాలురను గైకొని పోయి యమ్మహర్షికిం జూపి, యబ్బాలకుల యుదంతమును దెలియంజేసెను పిదప నా మౌని యా బాలకులను గాంచి. యాశీస్సులిచ్చి, ఉపహారవర్మ, అపహారవర్మయని నామంబు నొసంగెను. రాజసింహుండా బాలకులను దన పిల్లలతోం బాటుగాం బెంచుచుండెను. తనకై సాయము సలుపవచ్చి యిట్లిక్కట్లపాలైన ప్రహారవర్మ దంపతులనుగూర్చి మిక్కిలి విచారింపుచుండెను.

ఇట్లుండ నొకనాడు వామదేవుని శిష్యుండొక పసి బాలునిం గైకొనివచ్చి మహారాజునకు సమర్పించి "మహారాజా! యీ పసిబాలుండు మీ మంత్రి సుశ్రుతుని సోదరుండగు రత్నోద్భవుని కుమారుండు. అతండు ధనాకాంక్షతో విదేశ వ్యాపారమునకుం బోయిన విషయము దేవరవారెఱింగినదె. అక్కడ నొక సువృత్త యను నొక భాగ్యవంతురాలితోం బరిచయమయ్యెను. ఆ పరిచయము ప్రేమగా మారి వివాహమునకు దారితీసెను. పిదప వారు దంపతులయి, పరస్పరానురాగముతో నుండిరి. ఇట్లుండం గొన్నాళ్ళకు సువృత్త యంతర్వత్ని యయ్యెను. రత్నోద్భవునకు స్వదేశాగమనాభిలాష గలిగి తన కోరికను దన సతికినిం దెలియం

జేసెను. భర్త ప్రేమాభిలాషి యయిన సువృత్త యందు కంగీకరించెను. అంతట వారొక శుభముహూర్తంబున సముచిత పరివారంబుతో బయలుదేరి యొక నావమీఁదఁ బయనింపఁ జొచ్చిరి. తానొకటి దలఁచిన దైవమొకటిఁ దలఁచు నన్నట్లు మార్గమధ్యంబున వారెక్కిన యోడ నీటి కెడ మొసఁగి మునిఁగిపోవుతఱి, వారలెట్లో చెరియొక యొడ్డునఁ జేరిరి. ఆ సమయంబుననే సువృత్త ప్రసవించినది. కాని యామె భర్తృవియోగబాధచేఁ బ్రసవ వేదనాభరమును గూడ గణింపక, నీ బాలుని విడిఁచి పోయెను. ఆ ప్రాంతమునకే దాది యెట్లో నావనుండి బయటపడి వచ్చెను. ఆ దాది యీ బాలుని నెత్తుకొని, స్నానార్థమై యరిగిన నన్నుఁ జూచెను. వెంటనే యామె నా పసిబాలుని నెత్తుకొని నా కడకు వచ్చి యీ విషయంబులెల్ల నెఱిఁగించి యెట్లయిన దమకీ బాలుని నందఁజేయమని నుడివిన" దని తెలిపెను. అంతట నా రాజు సుశ్రుతునిఁ బిలువఁ బంచి, యతని కీ వృత్తాంతమును తెలియఁజేసెను. సుశ్రుతుడు దన సోదరుని యునికిఁ దెలియనందుకు విచారించెను. పిదప నా రాజశిఖామణి పుష్పోద్భవుఁడని యా బాలకునికి మహర్షి యాదేశానుసారముగా నామంబిడి, యల్లారుముద్దుగాఁ బెంచుచుండెను.

ఇట్లుండఁ గొన్ని దినంబులు జరిగిన పిదప నొకనాఁడు మహారాణి వసుమతిదేవికడకు నొక యక్షిణి యరుదెంచి యొక పసిబాలుని నొసఁగి 'మహారాణీ! యీ బాలుఁడు మీ మంత్రి ధర్మబాలుని కుమారుఁడయిన కామపాలుని

కుమారుఁడు. అతఁ డొకనాఁడొక సరోతీరంబున నుండెను. నేను నా చెలులతో నచ్చటి కరుదెంచితిని. ఆ సరస్సునందు మేమాతనిఁ జూడకయే స్నానమాచరించుచు జలక్రీడలఁ గావింపుచుంటిమి. అట్లు కొంతకాలము గడిపిన పిదప మేము దరికి వచ్చితిమి. నా చెలికత్తెలు వారివారి వలువల ధరించిరి. కాని నా వలువమాత్రము గనుపింపలేదు. వారు దెక్కువ కాలంబుండ వీలుపడక వారలేగిరి. పిదప నా కామపాలుఁడు నవ్వుచు నా చీరెను గైకొని వచ్చెను. అతనినిఁ జూడఁగనే నాకుఁ గోపమంతరించి, యనురాగ ముదయించెను. నేను నా లోకమును వదలి, యీ కామపాలునితో విహరించితిని. తత్ఫలితముగా నీ బాలుఁడు గలిగెను. ఈ విషయమును మా తండ్రియగు యక్షుఁడగు మణిభద్రుఁడు దెలిసికొను నేమో యని భయపడి కామపాలునితోఁ దెలిపితిని. అందుకాతఁ డీ బాలుని నెట్లయిన మీ కందీయమని తెలిపి, యెచ్చటికో పోయెను. మీ కుమారుఁడు రాజవాహనుఁడు నవద్వీపంబు నేలు చక్రవర్తి కాఁగలండు. అప్పుడీ బాలుఁడు వృద్ధినొంది, యతనిని సేవించి వంశప్రఖ్యాతిని నిలుపుకొనఁగలఁడు మీకు శుభమగుఁగాక' యని యంతర్హితురాలయ్యెను.

అంతట వసుమతీదేవికి సంభ్రమాశ్చర్యంబులు ముప్పిరి గొన మహారాజుకీ వృత్తాంతమును నివేదించెను. అంతట నాభూజాని యీ బాలుని యద్భుత సౌందర్యంబుల కచ్చెరువడి, సుమంత్ర సుమిత్రులను రాఁబనిచి యీ విషయమును నెల్ల వారికిఁ జెప్పెను. వారు దమసోదరుని యునికిఁ దెలయనందుకు

విచారపడిరి. రాజసింహుం డబ్బాలున కర్ధపాలుండను నామం బిడి యల్లారుముద్దుగాఁ బెంచుచుండిరి.

మఱియొకనాఁడు రాజసింహుఁడు వసుమతీదేవితో నిష్టాగోష్ఠి జరుపుచుండఁగ వామదేవ మహర్షి శిష్యుఁ డొక పసిబాలునితో వచ్చి, యమ్మహారాజునకు సమర్పించి, 'మహారాజా! ఈతఁడు దమ మంత్రిపుత్రుని కుమారుఁడు. సత్యవర్మ తీర్థయాత్రాగతుఁ డయ్యెనను విషయము దమ రెఱింగినదే! అచట నిరువురు యవ్వనవతులను గాంచి వ్యామోహపడి, వారిరువురను బెండ్లియాడెను. అందొక యామె సంతానవతి యయ్యెను. అది చూడలేక యింకొక భార్య యొక దాది కా బాలుని నప్పగించి, యెట్లయిన నీతని నదిలో వేసిరమ్మని చెప్పెను. అంత నాదాది యతని నెత్తుకొని దేశంబులందిరుగుచు, నాకుఁ గనఁబడి, యా వృత్తాంతమును దెలియఁజేసి, పోయిన' దని తెలిపెను. అంత నా రాజు ముద మంది యబ్బాలకునకు సోమదత్తుఁడను నామంబిడి యల్లారు ముద్దుగాఁ బెంచుచుండెను. అప్పటికిఁ బదిమంది కుమారు లయ్యెను. అంత నాబాలకులకు నైదుసంవత్సరములు రాగానే విద్యాబాధ్యతలు వామదేవమహర్షి స్వీకరించెను. అమ్మహర్షి శిక్షణమునందు నచిరకాలంబుననే సకల విద్యా పారంగతు లైరి. అరువదినాలుగు విద్యలయందు నప్రతిమాన ప్రతిభా వంతులయిరి. దశకుమారు లా ప్రాంత నివాసులగు కిరాత జాతులందరికి నాయకులైరి. వామదేవమహర్షి యాశీః ప్రభా వమే యా రాజకుమారుల యౌన్నత్యమునకుఁ గారణ మయ్యెను. అంత నొకనాఁడు దశకుమారులు రాజహంసునికడ

నిష్టాగోష్ఠి జరుపుచుండిరి. ఆ సమయంబున వామదేవమహర్షి యచ్చోటికి విచ్చేసెను. రాజకుమారులా మహాచంద్రునకు స్వాగత సత్కారంబు లొసంగిరి. అంత నా తాపసి మనంబున నలరి వారల నాశీర్వదించి యుచితాసనాసీనుండై రాజసింహునితో "మహారాజా! పూర్వజన్మ సుకృతంబున నీ యీ కుమారులెల్లరు విద్యా వినయ వివేక సంపన్నులైరి. ప్రతిమాన శౌర్యోదార్య విభవంబులం గలిగియుండిరి. వీరల మూలంబున నీ మనోభీష్టంబు దీరగలదనుటలో సంశయము లేదు. ప్రస్తుతము నాకొక యూహ జనించినది. అది యేమన రాజహంసుడు నాయకుండై, తక్కిన మిత్రుల సలహాను బాటించి దిగ్విజయయాత్ర గావించుట మంచిదని నా యభిప్రాయము. అదియునుగాక నందుకుం దగిన ప్రాయముకూడ వీరికి లభించినది. మీకు మేలు లభించు నవకాశముకూడం బ్రాప్తించుచున్నది. ఆ దిగ్విజయయాత్రకు ననుకూలమగు మున ముహూర్తముకూడ రేపటి దినముననే నిశ్చయించితి" ననెను. అందుకు రాజసింహుం డెంతయో సంతసించి కుమారులను దిగ్విజయ యాత్రకుం బనుపుటకు నిశ్చయించుకొనెను. వెంటనే కుమారదశకమును గాంచి 'కుమారులారా! మహర్షి వామదేవుని యాదేశమును శిరసా వహించుటకన్న వేరు కర్తవ్యము లేదు. కాన నందుకు సన్నద్ధంగండ'ని చెప్పెను. అంత నా దశకుమారులు దిగ్విజయయాత్రకు ప్రస్థితులగు చుండిరి. మహారాజు వారికిం గావలసిన సంభారంబు సమకూర్చెను. వీరులయిన కుమారదశకము మహర్షి యాశీస్సు నొంది తల్లిదండ్రుల యనుమతి గొనిరి. అంత రాజవాహ

నుఁడు దన స్నేహితబృందముతోఁ గలిసి గ్రహంబులతోఁ గూడి నడచు గ్రహరాజువలె శోభిల్లుచు బయలుదేరిపోయెను.

అట్లు వారు జయజయధ్వానములఁ గావించుకొనుచు, సత్యుత్సాహంబునఁ బోవుచుండిరి. మార్గమధ్యమందు నొక చోట నలుపువర్ణము గలిగిన శరీరమెల్ల కత్తిదెబ్బల చిహ్నము లున్న యొకవ్యక్తి గనఁబడెను. అతనికి యజ్ఞోపవీతము భుజము మీఁదికి వ్రేలాడుచుండెను. అతనిఁ గాంచి రాజవాహనుఁ డాశ్చర్యపడి, తమదంతమును నరయఁగోరెను. అప్పుడాతఁడు 'రాజనందనా! నేను పవిత్రమయిన బ్రాహ్మణ వంశమునందు జన్మించితిని. కాని దురదృష్టవశమున సదాచారములను వదలి తిని. కాని యాటవికుల యాచారములు పట్టుఁబడినవి. అందు చేత ననేకదుర్మార్గకృత్యము లొనరించితిని. చేయరానిపనులను నేను చేసితిని. ఇట్లుండ నొకనాఁ డొక బ్రాహ్మణుఁడు నాకు గనఁబడెను. ఏ కారణము వలననో యతనినిఁ జంపుటకుఁ జేతులు రాలేదు. అతనిమీఁద దయకూడఁ గలిగెను. కాని నా తోటివా రందుల కంగీకరింపక నాతోఁ బోరిరి. నేనప్పుడు మృతిజెంది యమలోకంబున కరిగితిని. నే నా బ్రాహ్మణుని కాపాడిన పుణ్యమువలన యమధర్మరాజు కరుణించెను. వెంటనే సన్నీ దేహముతోడనె తిరిగి భూలోకమున కంపిం చెను. కాని నాపూర్వపుబుద్ధిమాత్రము నాకురాలేదు. వేరొక బ్రాహ్మణుని కృపవలన నఖిల శాస్త్రంబు లభ్యసింపఁ గలిగి తిని. నన్ను మాతంగుఁ డందురు. కావున నాకు నీవలనఁ గొంత సహాయము గావలసివచ్చినది. ఉత్తమ క్షత్రియులకుఁ బరుల కుపకారము చేయుటకన్న వేరు ధర్మము లేదుకదా!

నీవట్లు వ్యాఖ్యానము గావించినచో నీకా విషయమును విన్న పమును గావించుకొందు' నని తెలిపెను.

అతని పలుకులు వినగానే రాజవాహనున కాశ్చర్యము గలిగినది. రాజనందనుం డతనికి సాయము గావింపఁదలంచెను. అప్పుడతనితో 'నీవు చెప్పఁ దలఁచుకొన్నది ధారాళముగఁ జెప్పుము. పరోపకారార్థ మిదంశరీరమ్మను నార్యోక్తి కలదు కదా! అదియుఁగాక ఆర్తులకు సహాయము గావించుట వీరుల లక్షణముకదా!' యనెను. అంత నా మాతంగుఁ డతనిని రహస్యస్థలంబునకుఁ గొనిపోయి, యేకాంతముగాఁ బ్రసంగించి, 'రాజకుమారా! నీవే సాయమును గావింపఁ గోరెదను. నాకుఁ బాతాళమార్గము నాకుఁ దెలియును. నేనా లోకమున కధిపతిఁ గాఁగలను. అందువలన నీకు శుభము లొనఁగూడఁ గలవు. ఇకార్యభారమునందు నీ సహాయ మనశ్యకర్తవ్య'మని పలికెను అంత నా రాజవాహనుఁ డంగీకరించి. తన మిత్రబృందమును నందుండ నియమించి, తా నాతనితోఁ గలిసి పాతాళ మార్గమునకుఁ బోయెను. అంత నా మాతంగుఁడు రాజకుమారునిఁ దోడ్కొని పాతాళము నకుఁ జేరెను అటకుఁ జేరఁగనే మాతంగుఁ డొక యజ్ఞమును గావించి యందుఁ దన శరీరమును నగ్నికర్పించెను. కాని మరు క్షణమునందు నతఁడు దివ్య శరీరధారియై యగ్నికుండమునుండి వెడలవచ్చెను. పిదపఁ గొంతసేపటికి కాయగ్నిగుండంబునుండి, యమిత సౌందర్యవతియయిన యొక కాంత తన చెలికత్తెలతోఁ బ్రత్యక్షమయ్యెను. అవ్వనితను గాంచి మాతంగుఁ డమితా నంద భరితుఁడయ్యెను. అప్పుడా సౌందర్యవతి యొక వజ్ర

మును బహూకరింపుచు 'బ్రాహ్మణోత్తమా! నే నసురరాజ తనయను. కాళిందియను దానను. దేవతలతో యుద్ధమొన రించి నా తండ్రి నిహతుం డయ్యెను. నే నమిత దుఃఖభార ముతో నుండి భరింపఁజాలక ప్రాణత్యాగమును గావింపనున్న తఱియాకాశవాణి సమర్థుఁడగు నొకఁడిచటకు రాఁగలడనియు, నాతో పాటు రాజ్యమున కర్హుఁడు కాఁగలఁడనియు నుడివెను. నాటినుండి ప్రాణములను బిగబట్టి నీకొరకై వేచియున్నాను. ఇఁక నన్ను నీ రాజ్యమును స్వీకరింపు'మని ప్రార్థించెను. మాతంగుఁడమందానంద భరితుఁడై, రాజవాహను నను మతంబున నా కన్యను బరిణయంబాడి, యీ పాతాళరాజ్య మున కధిపతియయ్యెను. అంతట మాతంగునకు రాజకార్యంబు లందు మిక్కిలిగాఁ దోడ్పడుచుండెను. అంత నా కాళింది యీ నృపాలునకు నాకలిదప్పులు గలుగనీయని మణి నొకటి ప్రసాదించెను. పిదప నా మాతంగుఁడనేక విధముల నారాజ వాహనుని సత్కరించి, సమస్త మర్యాద లొనరించి తిరిగి భూలోకమున కనిపెను.

అంతట రాజవాహనుఁడుదనమిత్రబృందమున్న ప్రదేశం బునకరుదెంచెను. కాని యచ్చట స్నేహితులుగాని, సేనగాని యేమియుఁ గనఁబడలేదు. వారు రాజవాహనుఁ డెన్నాళ్ళకుఁ దిరిగి రాకపోవుటచే నతనిని వెదుకుటకు నొక్కొక్క రొక్కొక్క మార్గము ననుసరించి పోయిరి. రాజవాహనుఁడు వారి జాడ గానక వెదుకుచుఁ జివరకు శిలానగరమును జేరు కొనెను. తన భవిష్యత్కర్తవ్యమును దెలియఁజాలక వేదన బడుచుండెను. అప్పురమంతయు వెదకి తుదకు నొక యుద్యాన

మునఁ బ్రవేశించి, యందొక శిలాతలముపై విశ్రమించెను. అందలి పుష్ప సౌరభములు, చల్లని మెల్లని పిల్లగాలులు మనస్సునకు హాయి గొలుపుచుండెను. కాని తన మిత్రబృందమును దలంచుకొన్న కొలంది యావేదనము, ఖేదము గలుగుచుండెను. ఇట్లుండ నొక్కింతదూరమున నొక పల్లకి యా యుద్యాన వనమునకే వచ్చుచుండెను. అందున్న దెవ్వరో యని యా రాజవాహనుఁ డాత్రంబునఁ జూచుచుండెను. ఆ పల్లకి యతని సమీపమునకే వచ్చెను. అందొక పురుషుఁడు ఒక స్త్రీయు నుండెను. ఆ పురుషుఁ డా రాజవాహనునిఁ గాంచగనే తక్షణము క్రిందికి దిగి యతనినిఁ గౌఁగలించుకొనెను. అంత నా రాజనందనుఁ డతనిని సోమదత్తునిగా నెఱింగి, పెన్నిధి లభించిన పేదవలె నతనిని మఱింత పరిష్వంగన మొనరించుకొనెను. అప్పుడు రాజపుత్రుఁ డాతనిని గాంచి "సోమదత్తా! నేను పాతాళమునుండి వచ్చి మీయునికి తెలియక యమితవేదనతో బాధపడుచుంటిని. నిన్నుఁ జూడఁగనే సకాలమునందు వర్షము గురిసిన కర్షకునివలె నా మనస్సు నెంతో కుదుటఁబడినది. మీరందఱెందుఁ బోయితిరి? నాకు సవిస్తరముగాఁ దెలుపు" మని కోరెను.

## సోమదత్తుని కథ

ఆ మాటలు సోమదత్తుఁ డాలించి 'రాజకుమారా! నీవా మాతంగునితోఁ గలిసి పోయిన పిదప నీకొఱకుఁ జాల వఱకు వేచియుంటిమి. కాని నీజాడ యొకింతయేనిఁ దెలియక

బాధపడినారము. నిన్ను వెదకుటకు మే మొక్కొక్కర మొక్కొక్క దిక్కునకుఁ బోయియుంటిమి. నేను పోయి పోయి యొక తటాకపు దీరంబునకుఁ జేరితిని. నడివేసంగి యగుటచే మిక్కిలి దాహమయినది. అందుచే నందు దిగి, నీరు గైకొని త్రావఁబోవు సమయమునందొక మణి యట గనఁబడెను. నేను దానినిఁగొని భద్రముగావించి, వలయు జలమును గ్రోలి తిరిగి బయలుదేరితిని. కొంతదూరము నేను బోవునప్పటికి నొక బ్రాహ్మణుఁడు గనఁబడెను. అతఁడు నన్నుఁ జూడగనే యాప్యాయముగాఁ బలుకరించెను. అప్పు డాతనినిఁ జూచి 'బ్రాహ్మణోత్తమా! ఈ నగరమునకు నేను క్రొత్తవాడను. ఇందలి విషయంబులను నా కెఱిగింతురా!' యని ప్రశ్నించితిని. అందుకాతఁడు సాదరముగ 'మీరు దీర్ఘ ప్రయాణము గావించి, యలసట జెందినట్లున్నది. నేడు మా యింట నాతిథ్యముగొన రండు. పిదప నీ నగరమందలి విశే షంబులను సాకల్యంబుగ వివరింతు' నని తెలిపి, నన్ను దన గృహంబునకుఁ గొనిపోయెను. అంత నా కతఁడు గౌరవ పుర రస్సరంబుగా నాతిథ్యమొసఁగెను. ఆ ద్విజుఁడు నాయందుఁ జూపిన యాదరణకుఁ గృతజ్ఞతావందనము లర్పించితిని. పిదప నా భూసురుఁడు నన్నుఁజూచి 'మంత్రినందనా! ఈ పట్టణ మును వీరకేతుఁడను రాజు పరిపాలింపుచుండెను. అతఁడు ధర్మవర్తనుఁడై ప్రజానురంజకముగఁ బరిపాలింపుచుండెను. వీరకేతునకు వామలోచన యను నొక కుమార్తె గలదు. ఆ బాల సౌందర్యము వర్ణింప సాధ్యముగాదు. అందుచేత మత్తకాలుఁడను రాజామెను వివాహమాడ నిశ్చయించి,

యీ రాజ్యముపై దండెత్తివచ్చినాఁడు. మత్తకాలుఁడు లాటదేశ పరిపాలకుఁడు. ఉభయసైన్యంబు లెదుర్కొనెను. లాటదేశ సైన్యంబుల ధాటికి నాగలేక వీరకేతు సైన్యంబులు పలాయనంబులయ్యెను. అంతట వీరకేతువు తన కపజయము గలుగుట నిశ్చయమని భావించి సపరివారముగా గుప్తమార్గమువెంన నరణ్యములకుఁ జేరెను. పిదప నీ రాజ్యము మత్తకాలుని స్వాధీనమయ్యెను. తరువాత రాజకుటుంబముకొఱకు వెదుకఁగ నందెవ్వరు కనఁబడకపోవుటచే వృథాశ్రమ యయ్యెనని భావించెను. కాని యిప్పటికి వారికొఱకు వెదుకించుచునే యుండెను. కాని మంత్రులు దమరాజ్య మతని స్వాధీనమైనప్పటికి నతనితోఁ బోరాటము సాగింపుచునే యుండిరి. ఇదియే యీ నగర విశేష" మని తెలిపెను.

అంత నా బ్రాహ్మణుఁడు నాకుఁ గావించిన యాతిథ్యమునకు గానుకగా నాకు లభించిన రత్నమును నాతని కొసంగి, నేను విశ్రమించితిని. అట్లు విశ్రమించి లేచినప్పు డా బ్రాహ్మణుని రాజభటులు బంధించి కైకొని పోయినారని యింటనున్నవారి మూలంబున విని, వెంటనే యటకుఁ బోయితిని. అట నతని రత్నాపహర్తగా భావించి, యట్లు గావించిరని తెలిసికొని, వారితో నిజమును వచించి, యతనిని విడిపించితిని. కాని వారది విశ్వసింపక నన్ను బంధించి తీసికొని పోయి చెరసాలయందుఁ బడవైచిరి. అందు నాకు వీరకేతుని మిత్రులు గొందఱు నాకు స్నేహితులైరి. నేను వారితో నాలోచించి, యావలకు నొక సొరంగము ద్రవ్వి బయటఁ బడి, వీరకేతుని మంత్రియగు మానపాలునికడకుఁ జేరినాము.

ఈ విషయమును రాజభటుల మూలముగ మత్తపాలుఁడు గ్రహించి, మిక్కిలి కోపించెను.

మాకు నాతనికిఁ బోరు ముమ్మరమయ్యెను. నేను విజృంభించి మత్తకాలుని సైన్యమును నాశనమును గావింప మొదలిడితిని. నాకుఁ దోడు మంత్రి మానసపాలుఁడు ప్రళయ కాల ఝంఝామారుతమువలె వీరుఁడై, విరోధి సైన్యంబులను జెండాడఁ జొచ్చెను. మాకుఁ గాల మనుకూలమై, మత్తకాలుఁడు, కాలుని కతిథిగాఁ బోయెను. సంపూర్ణముగా మాకు జయము లభించెను. అంతట మా సైన్యంబులు జయజయధ్వానంబు లొనరించెను. మంత్రి మానసపాలుఁడు నన్నుఁ జూచి 'వీరశిఖామణీ! నీ వొనరించిన సాయము చిరస్మరణీయమైనది. నీవు చూపిన యప్రతిమాన ప్రతిభా విభవంబులు, శౌర్య ధైర్య గాంభీర్యంబు లెంతయో మెచ్చుకొనఁ దగినవి. ఇందుకు మా రాజకుటుంబము తరఫున మీకుఁ గృతజ్ఞతా వందనంబు లర్పించుచున్నారము. ప్రస్తుతము మన ప్రభువయిన వీరకేతుని వెదకి, మరల సింహాసనాసీనునిఁ గావింతము రం'డని చెప్పి యతని యునికి గ్రహించి, యటకు నన్నుఁ గొనిపోయెను. ఆ సమయంబున వీరకేతు తనకు కలిగిన దురవస్థకు మిక్కిలి చింతిల్లుచుండెను. ఆ నృపతి మంత్రి మానసపాలునిఁ జూడఁగ వికసిత వదనారవిందుఁ డయ్యెను. మానసపాలుఁడు జరిగిన యుద్ధవిషయంబు లెల్లంజెప్పి, నన్నుఁ జూపెను. అబ్భూపతి ముదమంది నాకుఁ బ్రత్యామ్నాయ నమస్కారంబు లొనరించి మిక్కిలి గౌరవించెను. అంతట నాతనిఁ దోడ్కొని తిరిగి సింహాసనాసీనునిఁ గావించితిమి.

మంత్రి మానపాలుని యాదేశానుసారంబుగా, నా వీరకేతువు దన కుమార్తెయయిన వామలోచనను నొక శుభముహూర్తంబున నాకిచ్చి బ్రహ్మాండంబుగా వివాహంబు గావించి, యనేక రీతుల నన్ను సత్కరించెను. పిదప నా రాజ్యంబునకు నన్నుత్తరాధికారిగా నియమించెను.

నేనా రాజకుమార్తెతో లీలావిలాసంబులతో బాటు, భోగంబులం బొందుచుంటిని. రాజకుమారా! ఎన్ని సుఖంబులనుభవించిననేమి! నిన్నుం దలంచుకొన్నప్పుడు నా హృదయమునందు దుఃఖము నావరించి, వచింపంజాలని యావేదనలు గలుగచుండెడివి. ఒక మహాత్ముండొకనాఁడు మా నివాసంబున కరుదెంచెను. అతనికి నాతిథ్యాదులొసంగి నీ యునికింగూర్చి ప్రశ్నించితిని. అందుకాతఁడు గొంచెము నాలోచించి 'రాజపుత్రా! నీ మిత్రునిం గలియు దినములు సమీపించినవి. నీవు సతీసమేతముగా శివాలయమున కేఁగి, యటం బూజం గావించి నిన్ను వెదకినచో నీవు తప్పకుండం గలియఁగల"వని యాతఁడు నాకాదేశించెను. నేనంతట నమందానంద కందళిత హృదయారవిందుఁడనయి, యీ నా విషయమును వామలోచనకు సాకల్యంబుగాఁ దెలిపితిని. అంత నామె యందుకంగీకరించి ప్రోత్సాహించెను. వెంటనే యీ రోజు మహాత్ముఁడు వచించినట్లుగ వామలోచనను దోడ్కొని వచ్చి శివాలయంబున కరుదెంచి పూజగావించి, నిన్నుం గలుసుకొన వచ్చుచుండఁ బరమేశ్వరుని కృపవలన నిచ్చటఁ గాంచితిని. నా భారము దీరినది. నా వ్యథ యంతరించినదని చెప్పి యతనిని, సకల మర్యాదలతోఁ దన పల్లకిపై నెక్కించు

కోని శివాలయంబునకుం బోయెను. రాజవాహనుఁడు దన పాతాళవృత్తాంతంబెల్ల వచియించెను. ఇంతలో శివాలయము సమీపించెను. రాజవాహనుని కొఱకు వెదకుచుఁ బుష్పోద్భవుఁ డక్కడకుఁ జేరుకొనెను. అతనినిఁ జూడఁగనె వారిరువురు బ్రహ్మానందభరితులయి యతనినిఁ గౌఁగలించుకొనిరి.

## పుష్పోద్భవుని కథ

అంతట రాజవాహనుఁడు పుష్పోద్భవునిఁ గాంచి, మిత్రమా! నీవెందేఁగితివి. అందుఁగల విచిత్రంబులం దెలిపి, నా కానందమును గూర్పుమన నంతు కాతఁడు 'రాజనందనా! నీవట్లు మాతంగునితోఁ జనిన పిదప నెవ్వాళ్ళకు నీజాడ తెలియకపోయినది. మే మత్యంత విషాద మనంబులతో నీయునికి తెలిసికొనుట కొక్కొక్కరు మొక్కొక్క దిశకుఁ బోవ నిశ్చయించితిమి. అప్పుడొక దిశకు నేను బయలుదేరితిని. అట్లు పోయి పోయి యొక శైలముకడకుఁ బోయితిని. అటకుఁ బోవు నప్పటికిఁ జాల నలసియుండుటచే నిఁక నడువఁజాలక యందు విశ్రమించి యుంటిని. కాని నీ జాడ యెట్లు దెలియఁగలనని దీర్ఘాలోచనా తత్పరుఁడనయి యుంటిని. కింకర్తవ్యతా మూఢుఁడనయి యుంటిని. ఇంతలో కొండమీఁదనుండి యొక వ్యక్తి దుముకుచున్నట్లు గనబడెను. వెంటనే పరుగిడి యాతనినిఁ బట్టుకొంటిని. అప్పుడాతఁడు మూర్ఛలోనే యుండెను. నే నాతనికి నుపచారములు చేసినంత కొంత తెప్పరిల్లెను. అంత నే నాతనితోఁ అయ్యా! మీరెవ్వరు? ఎందుకీ సాహసము గావించితిరి? జీవితముపై నట్లు విరక్తి గలుగుటకుఁ

గారణమేమి? వినవలతునేని దెలియఁ గోరుచుంటి' నని యంటిని. అంత నాతఁడు 'అయ్యా! నాకథ విషాదపూరితమయి నది. కాని యింక నాకు నీ ప్రపంచమునకు సంబంధము వీడ నట్లు గనఁబడుచున్నది. మీరెవరో దయాపూరితులువలెఁ గాన్పడుచున్నారు. మీలాంటి అమృతహృదయులకు నావిషాద గాధ చెప్పిన మనస్సునకుఁ గొంత విశ్రాంతి గలుగఁ గలదు. నేను మగధదేశపు మంత్రియయిన పద్మోద్భవుని కుమారుఁడను. నాపేరు రత్నోద్భవుఁడు. నేను వ్యాపారార్థమై కాలయవన ద్వీపమునకుఁ బోయితిని. అది నాకుఁ గొత్త ప్రదేశ మగుటచేఁ దలవని తలంపుగా నొక వర్తకుని పరిచయము గలిగి, యతనియింట నాతిథ్యము గొంటిని. ఆతఁడు నా యుదంతమంతయు విని, తన గృహమునఁ గొన్నాళ్ళుండమని కోరియుంటిరి. ఆ వర్తకునకు సువృత్తయను నొక కుమార్తె గలదు. ఆమె యందమునందు నామెకు నామెయే సాటి. రూపమునకుఁదోడు సుగుణవతియైకూడ నుండెను. ఒక నాటి. యుదయమున నా వర్తకుఁ డెక్కడికో పోయెను. ఆ సువృత్త సకలాలంకరణముల ధరించి, యపురూపవతియై నాకుఁ గనఁబడెను. ఆయువ్వనవతి గనఁబడగానే నాకు మనస్సు వివశమయ్యెను. నన్నుఁ జూచినదాది యామెకూడ నట్లుండెనని తరువాతఁ దెలిసికొంటిని. కాని యీ నాకోరిక నా వర్తకునకుఁ దెలియఁజేయుటకుఁ ధైర్యము చాలకపోయెను. దైవనిర్ణయము గలిగినచో నప్రయత్నముగా నఖిల కార్యములు నెరవేరును గదా! నాకు సువృత్తకు నొకశుభదినమున వివాహమయ్యెను. నాటినుండి పరస్పరాన్యోన్యానురాగముతో నుంటిమి ఇట్లుండ

దిగిగి స్వదేశమునకు రానెంచి, నా యుద్దేశ్యమును సువృత్తకుఁ దెలియఁజేసితిని. అనుకూలవతియగు నా సువృత్త యంగీకరించినది. పిదప నా విషయమును నా మామగారికి విన్న వించితిని. అతఁడెట్టకేలకు మా ప్రయాణమున కనుమదించెను. ఒక శుభముహూర్తంబున నటనుండి యొక యోడన బయలు దేరితిమి. మాకు వలయు సంభారములన్నియు నా మామగారేర్పాటు చేయించెను. మేమట్లు నౌకాప్రయాణము చేయు చుండఁగ దురదృష్టవశమున నొక పెనుతుపాను వీచెను. అంతట నా తుపానుకు మా నౌక భగ్నమయ్యెను. నేనెట్లు తీరము చేరితినో తెలియదు. కాని సువృత్తగాని దాదులు గాని కనఁబడలేదు. వారి జాడలు వెదకుచు బదునారు వర్ష ములు దిరిగితిని. ఇంక వారు గనఁబడరని నిరాశఁజేసుకొంటిని. ఇంక నా యాశలాకాశ సుమములుగా భావించితిని. నేను జీవింపవలసిన యవసరము లోకమునందుఁ గనఁబడలేదు. ఎప్పటికయిన జీవితము ముగియవలసినదేయని యాత్మ హత్యకుఁ గడంగి, యీ కొండశిఖరమునుండి దూకుచు 'పరమేశ్వరా! యాప్తులను విడనాడి దుఃఖభాగినై జీవించుటకన్న మరణమును గోరుట మంచిది. నా యీ ప్రయత్నమునకుఁ దోడ్పడు'మని వేడితినిఁ కాని నేనాశించినట్లు జరుగలేదు. నీవు దైవసమానుఁడవు. సమయమునకు వచ్చి రక్షించితి వనెను. అందుకాతనికి నా వృత్తాంతమునుజెప్పక 'మహాశయా! మానవుఁడెంత ప్రయత్నించినను మరణ మకాలమున రాదుకదా! కష్టసుఖముల రెంటిని ననుభవించుటకు మానవు నకు విద్యుక్తధర్మమయి యున్నది. దైవనిర్ణయమును

దప్పించుకొన నసాధ్యముకదా! ఎంతటి ప్రజ్ఞానిధుఁడైన నెంతటి బలశాలి యయినను, దైవము వక్రించినప్పుడు కష్టములనుభవింపఁ దప్పదుకదా! యని యనేకవిధంబుల నూరడించితిని. ఇంతలో నాకొక రోదనధ్వని వినిపించెను. అంత నుభయుల మాదిశఁబట్టి పోయితిమి. అట యగ్నిలో నొకస్త్రీ దుమికి ప్రాణత్యాగము గావింప సన్నద్ధపడుచుండెను. ఆమెను బుష్పోద్భవుఁడు గుఱుతించి 'సువృత్తా! సువృత్తా!' యను కేక వైచెను. ఆమె కేకనువిని వెనుఁదిరిగి చూచెను. ఇంతలో నచ్చటికిఁ జేరితిమి. ఆమె యతనినిఁ బుష్పోద్భవునిగా నెఱింగి పాదములమీఁదఁ బడెను. ఆతఁడు గుచ్చియెత్తి కౌఁగలించుకొనెను. చిరకాల సమాగమమున వారి కానందబాష్పములు గ్రమ్మినవి. ఒకరికొకరు తమ కష్టసుఖంబులఁ జెప్పికొనిరి. అ శుభసమయంబున నాయుదంతము సాకల్యముగాఁ జెప్పితిని. అంత వారు నన్నుఁజూచి ద్విగుణీకృతానందమును బొందఁ గలిగిరి. రాజనందనా! యట్లు నా తల్లిదండ్రులను గలిసికొనఁగలిగితిని. కాని నిన్నుఁ దలంచుకొని బిట్టుగా విచారించితిని.

అంతట మేము నిన్నుఁ గలిసికొను నాత్రంబున నా ప్రాంతమునందున్న యొక ఋష్యాశ్రమంబునఁ జేరితిమి. అట నున్న మహాత్ముఁడగు మహర్షినిఁ జేరి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించితిమి. అతఁడు మా యుదంతమును సాకల్యంబుగా విని, కరుణించి త్వరలో నిన్నుఁ గలియఁగలవని యాతఁ డాదేశించెను. అప్పలుకులకు నమితానందపూరితుల మయితిమి. అంత నేను నా తల్లిదండ్రులను, నయ్యాశ్రమ

మందుంచి నేను నీకొఱకై బయలుదేరితిని. పిదపఁ గొంత మంది సహాయకులను వెంటఁగొని గారడీవిద్యలను బ్రదర్శింపుచు, దేశదేశంబులు దిరిగి కడకు నుజ్జయినీ పట్టణమునకుఁ జేరితిని. అందొక వర్తకుని గృహంబున నాతిథ్యంబును గొనుచుంటిని. ఆ వర్తకునికి బాలచంద్రిక యను నొక కుమార్తె గలదు. ఆమె మన విరోధియగు మానసారుని పుత్రికకు స్నేహితురాలు. మానసారునికి దర్పసారుఁడను నొక కుమారుఁడు గలఁడు. అతఁ డాధ్యాత్మికచింతనాపరుఁడై తపస్సునకుఁ బోయెను. అప్పుడా రాజ్యంబునకు దర్పసారుని పినతండ్రి కుమారుఁడు చండవర్మ రాజ్యమును నిర్వహింపుచుండెను. చండవర్మ సోదరుఁడు దారువర్మ వర్తకుని కుమార్తెయగు బాలచంద్రిక రూప వయోగుణ విశేషంబుల విని యామె నేలాగయినఁ బెండ్లి గావించుకొన నిశ్చయించి సమయము నకై వేచియుండెను. ఈ విషయమును బాలచంద్రిక విని యతని బారినుండి తప్పించుకొను నుపాయంబును నాలోచింపుచు, నేకాంతమున నున్న నన్నుఁ జేరి యా విషయంబు నంతయు నాకుఁ జెప్పెను. అంత నేనామెతో ధైర్యముగా నుండమనియు, నతని బారినుండియుఁ దప్పింతుననియు ననేక విధంబులఁ జెప్పి మనస్సు గుదటఁ బరచితిని. ఒకనాఁడు నేను స్త్రీవేషంబును ధరించి బాలచంద్రికతో దారువర్మ నివాస గృహంబునకుఁ బోయితిని. సమయంబును జూచి యతని యమలోకంబున కంపితిని. అంత నా బాలచంద్రిక నేను గావించిన సహాయమునకుఁ బ్రతీకారముగా నన్ను గాఢంబుగాఁ బ్రేమించెను. అంత బంధుపాలుఁడు నన్నుఁ జూచి

నా యావేదన గ్రహించి శకునంబులను జూచి నేఁడు పోయిన నీకు మిత్రదర్శనము గలుగఁగలదని చెప్పెను. అంత నే నతి వేగంబున వచ్చితిని. అందుకుఁ దగిన ఫలము గలిగినది.

పుష్పోద్భవుఁ డట్లుగా జెప్పఁగనే రాజవాహన సోమ దత్తుల కమితాశ్చర్యము గలిగినది. పిమ్మట వారందఱు గలిసి, యవంతీనగరమునకుఁ బయనమై పోయిరి.

వసంతకాలోదయము. ఆ దినములం దఖిలజీవుల కమితోత్సాహము జనించి, మదనోత్సవములకు నవకాశము గలిగించును. ప్రకృతి వికసించిన సుమంబులతోడను, సువాసనలు వెదఁజల్లు వాయువులతో విరాజిల్లుచుండును. ఉద్యానవనంబులు కోకిల కుహూ కుహూ నాదంబులతోను, తుమ్మెదల ఝుంకృతులతోను విరాజిల్లుచు నత్యంత శోభాయమానముగా నుండును. అప్పుడు సోమదత్తుతో రాజవాహనుఁడు పుష్పోద్భవుని గృహంబున బ్రాహ్మణవేషంబున నుండెను. ఒకనాఁ డా రాజనందనుఁడు సోమదత్తాదులతో నుద్యానవనమునకు విహరింపఁ బోయెను. ఆ సమయంబుననే మానసారునికుమార్తె యవంతిసుందరి బాలచంద్రికతోఁగూడ నందు విహరింపుచుఁ గామదేవునిఁ బూజింపుచుండెను. అదే సమయమున రాజవాహనుఁడు పుష్పోద్భవుఁ డచ్చోటికిఁ జేరిరి. బాలచంద్రిక వారినిఁ గాంచి, హర్షించి, యవంతిసుందరికి వారి నిరువురను బరిచయము గావించెను. ఆ సమయ మెట్టిదో కాని, రాజవాహనుని యద్భుత సౌందర్యము లవంతిసుందరిని నాకర్షించెను. అది బాలచంద్రిక గనిపెట్టి యంతకుముందే పుష్పోద్భవుని మూలమున రాజవాహనుని విషయము దెలిసి

కొనిన దగుటచే 'సఖీ! యీ బ్రాహ్మణుఁ డద్భుత చతుర శిల్పి. రత్నపరీక్షాప్రవీణుఁడు. నీ యాదరణ కెంతో యర్హుఁ డ'ని సాభిప్రాయముగాఁ దెలిపెను. బాలచంద్రిక పలుకులోఁ గల మర్మమును నవంతిసుందరి గ్రహించెను. ఆ సమయమున రాజవాహనుఁ డేదో దీర్ఘాలోచనాతత్పరు లైనట్లుండెను. ఇది కాంచి అవంతీసుందరి చంద్రికనుద్దేశించి 'సఖీ! రాజకుమారు లేదో యన్యథా మనస్కు లైనట్లున్నారు. వారి యాలోచన కంతరాయము గలుగకుండఁ జేయుదమా!' యని యనె. అతఁడు 'అట్లుకాదు. నాకేదో పూర్వస్మృతి మనంబునఁ గలిగినది. అది నిజమో కాదో రాజపుత్రిక నిశ్చయింపవచ్చు' ననెను. 'ఆ యదృష్టంబునకు మా సఖీహృదయ మాత్రంబునఁ బడుచున్న' దని బాలచంద్రిక యనెను.

అంత నా రాజవాహనుఁడు 'రాజకుమారీ! నేను గత జన్మమునందు శాంబుఁడను నృపాలకుఁడను. నా భార్య యజ్ఞవతి జగదేకసుందరి. సకల సద్గుణవతి. ఆమె నేను నొకనాఁడు విహరింపుచుండఁగ దాపునకొక హంసమిథున మరుదెంచెను. అవ్వానిఁ గాంచి వాసతి 'ప్రియా! యీ హంసమిథున సౌందర్యమును గాంచితివి కదా! వాని యనురాగ మెంతో చూడ ముచ్చటగుచున్నది. అవి మనకడనుండఁ గోరెదనని పలికెను. అందుకు నేను ముదమంది, యీ హంస మిథునమును బంధించితిని. అంత నవి క్రోధముతో 'మీకు వియోగము సంభవించుఁగాక. మరుజన్మలోఁగూడఁ గొంత కాలము బందీగా నున్నతరువాత మీకు సమాగమము కలుగఁ గల' దని యా మిథునము శాపంబొసంగెను. ఆ లక్షణంబులు

నీయందుఁ బ్రతిబింబింపుచున్నవనెను. అంత నా వృత్తాంతము విని, అవంతీసుందరి తన స్వాంతమునందీ విధిగాఁ బూర్వ స్మృతి గలిగెను. అది నిజమగునట్లుగా నవంతీసుందరి రాజ వాహానునకు బాలచంద్రిక మూలంబునఁ జెప్పించెను. అది కారణంబుగ, నన్యోన్య హృదయంబులందు గాఢానురాగంబు గలిగెను. ఇంతలో మహారాణీ వచ్చుచున్నదనువార్తతో వారు విడలేక విడలేక యథా నివాసంబులకుం జనిరి. ఒకరి కొరకు విడిచి వచ్చిన ననంతరము వారి హృదయంబులందు వియోగబాధ మిక్కుటంబయ్యెను. అంత నుభయులు బాల చంద్రిక మూలంబున నుత్తర ప్రత్యుత్తరంబులను బొందు చుండిరి.

ఇట్లుండ నొక గారడీ తన విద్యను బ్రదర్శింపఁజేయు టకు మహారాజును దర్శించెను. అంత నమ్మహారాజు రాజ మహలులో నా విద్యను బ్రదర్శించుట కనుజ్ఞ నొసంగెను. ఈ విషయమును బాలచంద్రిక మూలంబునఁ బుష్పోద్భవుఁడు విని, యా గారడీకి దగిన బసదన మొసంగి, రాజవాహాను, అవంతీసుందరుల ప్రేమలఁ దెలియఁజేసి, వారి వివాహాము నకుఁ దోడ్పడుమని చెప్పి యతని నంగీకరింపఁజేసెను.

అంతట నా గారడీ రహస్యముగా రాజవాహానుని తనతోపాటు కోటలోనికిఁ గొనిపోయెను. వీలుచూచుకొని రాజవాహానుఁడు అవంతీసుందరి యంతఃపురములోనికిఁ బోయెను. ఆమె రాజకుమారుని గాంచి విభ్రాంతమనస్క రాలయ్యెను. రాజనందనుఁడు దాను వచ్చిన విధానమును రాజకుమారికిఁ దెలియఁజేసెను. ఇఁట గారడీ తన విద్యను

ప్రదర్శింపుచు, రాజవాహనునితో అవంతీసుందరి వివాహ మాడుచున్నట్లు లోక ఘట్టముగూడఁ బ్రదర్శించెను. అది కాంచి యందరు హర్షించిరి. అవంతీసుందరీ రాజవాహను లట సంతోషసముద్రమునందు మునిఁగి తేలుచుండిరి. ఈ విషయ మెట్లో చండవర్మకుఁ దెలిసెను. అంత నతఁడు దీవ్రముగఁ గోపించి యతనిని బాధింప భటుల కనుమతి నొసంగెను. అంత చండవర్మ అంతఃపురద్రోహిగా రాజవాహనుని నిర్ణయించి మంత్రుల యాదేశానుసారముగా నతని కురిశిక్షను వేసెను. కాని రాజవాహనుని సద్గుణ రూపాదులను జూచి యవంతీసుందరీ జననీ జనకు లతనినిఁ గాపాడిరి రాజనంద నుఁడు దన ప్రియుఁడయిన రాజవాహనుఁ డట్లు దన తల్లి దండ్రులచే రక్షింపఁబడినాఁడని యవంతీసుందరి మిక్కిలి హర్షించెను.

అంగదేశపు రాకుమార్తె అంబాలిక యమిత సౌందర్య వతి. ఆమెను వివాహమాడవలెనని యెన్నో దినములనుండి చండవర్మ వేచియుండెను. అంత నొకనాఁడు చండవర్మ సకల సైన్యసమేతుఁడై యంగదేశముమీఁదికి దండెత్తెను. ఉభయ సైన్యంబులకుఁ బోరు ముమ్మరముగా సాగెను. కాని యా సమరమున నంగదేశపు నృపాలుఁ డోడిపోయెను. అంత చండ వర్మ యతని బంధించి, యా రాజ్యమును స్వాధీన మొన రించుకొనెను. పిదప నంతఃపురమునందున్న అంబాలికను నపహరించి యవంతీపట్టణమునకు గొనితెచ్చెను.

రాజవాహనుని సంహరించుటకు నియమించిన మదకరి యతనినిఁ జంపుటకు మారుగాఁ దత్పాదంబులకుఁ గట్టిన

సంకెళ్ళను నూడఁదీసెను. అట్లు బంధములను వీడినంత రాజ వాహనుఁడమిత కోపోద్రిక్తమానసుండై, ఖడ్గమును జేబూని చండవర్మను సంహరింపఁ బోయెను. అచ్చట చండవర్మను అపహారవర్మ వధించెను. వెంటనే యతఁడంబాలికను విడి పించి వచ్చుచు రాజవాహనున కెదురయ్యెను. అంత నా మిత్రునిఁ గాంచినంతన నమితానందమును జెందెను. చిరకాల సమాగమ స్నేహితులగుటచే నుభయులు కౌఁగలించుకొనిరి. అంత ప్రహారవర్మ 'రాజకుమారా! చండవర్మపై దండెత్తిన వాఁడ నేనె. అంగదేశపు రాజయిన సింహవర్మకు నితఁడు గలిగించిన యపకారమునకుఁ బ్రతీకారమును గావించితిని. నా స్నేహితుఁడయిన ధనమిత్రుఁడా సింహవర్మకు నత్యం తాప్తుఁడు. అదియును గాక మనమిత్రులంద ఱచటనే యున్నా' రనియుఁ జెప్పుచు సింహవర్మ పుత్రికయగు నంబాలి కను జూపెను. పిదప అపహారవర్మ రాజవాహనునిఁ దోడ్కొని ధనగుప్తుని సేనా శిబిరమునకుఁ బోయెను. రాజ వాహనునిఁ గాంచి మిత్రులందఱు మిక్కిలి సంతోషవారాశి నోలలాడిరి. ఒకరికథ లొకరు చెప్పికొనిరి. రాజవాహనుఁడు పుష్పోద్భవ సోమదత్తుల కథలు మిగిలినవారికిఁ జెప్పి వారిని హర్ష వర్షమునఁ దడిపెను. పిదప రాజవాహనుఁడు అపహార వర్మను గాంచి 'మిత్రమా! నీ వెందేఁగితివి? అందు గలి గిన విచిత్రము లేమి? సింహవర్మ, ధనమిత్రాదు లెట్లు నీకుఁ బరిచయమైరి? అంతయు నాకు విశదము గావింపు' మని యడిగెను. అంత నా అపహారవర్మ తనకథను నిట్లు జెప్పఁ దొడంగెను.

# అపహారవర్మ కథ

రాజవాహనుఁడు దన వృత్తాంతమును నడిగిన నపహారవర్మ "మిత్రమా! నీవు పోయిన పిదప మే మచ్చట గొన్నాళ్ళుంటిమి. కానినీయునికి తెలియక యొక్కొక్కర మొక్కొక దిక్కునకుఁ బోయితిమి. నేను బోయిన దిక్కునందు నీజాడ యెక్కడ తెలియఁజాలక పోయితిని. అట్లు నే నతి విషాదముతో దిరిగి, తిరిగి గంగానది యొడ్డునకుఁ జేరి కింకర్తవ్యతామూఢుఁడ నయియుంటిని. ఆ ప్రాంతమునందు మరీచిమహర్షి యాశ్రమము గలదని వింటిని. ఆతఁడతి మహిమోపేతుఁడనికూడ వినియుంటిని. లందుచేత నమ్మహర్షి కృపవలననీవృత్తాంత మెఱయఁగలనని యాశించితిని. నాయాశ లడియాశలయ్యెను. ప్రస్తుత మమ్మహర్షి చంపానగరమునందున్న లావణ్యవతి యయిన కామమంజరి యను వేశ్యకు దాసుఁడనయినట్లుగా విని నిరాశఁ జెందితిని. కాని యమ్మహాత్ముని దర్శించినందువలన ఫలితము లేక పోయినను, నష్టము లేదుకదా యని భావించి, యతివేగంబున నమ్మహర్షి యాశ్రమంబునకుఁ జేరితిని. కాని యప్పుడమ్ముని తపోనిష్ఠయందుండెను. కొంతసేపు మహాముని కడనిలిచి యుంటిని. పిదప నతఁడు నిష్ఠ చాలించి నా ప్రణామంబుల స్వీకరించి, నా యుదంతమును నడిగెను. అప్పుడు మదుదంతమును నాద్యంతమును దెలియఁజేసి తనపైఁ గరుణింపమని వేడికొంటిని. అందు కాతఁడు ప్రస్తుత మెవ్వరినిఁ గరుణింప లేని స్థితియందుంటిననియు, నందుకుఁ గారణ మా కామమంజరి యనియు, నామె తనను మోసఁగించినదనియుఁ దెలిపెను. నా ప్రథమమున విన్నదానికి మ్మహాముని వచించిన

దానికిఁ జాల వ్యత్యాసముండుటచే నా కామమంజరి కావించిన మోసమును గూర్చి తెలియఁగోరిన నమ్మునివ 'కామమంజరి తన సహోదరితోఁ బందెమాడి తన ప్రజ్ఞ ప్రదర్శింపఁ జేయుటకుఁ దనను స్వాధీన మొనరించుకొనినదనియుఁ దన సంకల్పము నెరవేరఁగానే తనను మోసగించిన దనియుఁ దచ్ఛాప ఫలితముగాఁ దన తపోబలము సర్వము విఫలమయిన దనియు, మరల నద్దానిని సంపాదించుటకుఁ దపము గావింపుచుంటి' ననియుఁ దెలిపెను. మఱియు నాతఁడు నేను చంపా నగరమందుండెనేని మేలు గలుగుననియు బలికెను. అంత నమ్మునికడ శలవు గైకొని, చంపానగరమునకు బయలుదేరితిని. మధ్యమార్గమునందు వసుపాలితుండను మరియొక సన్యాసిని దర్శించితిని. అతఁడుగూడ కామమంజరి కృత్రిమ ప్రేమ పాశంబునఁ జిక్కి భ్రష్టుఁడయ్యెను. అందుచేత నీ నిఱువుర చరిత్రలను బూర్ణముగాఁ దెలిసికొని యుండుటచే చంపానగరమం దతి జాగరూకత వహింప నిశ్చయించితిని. తరువాతఁ గొన్ని దినంబులకు నా చంపానగరమును జేరితిని.

అప్పురమునందు ధనవంతు లధికముగా నుండిరి. వారందఱు దానధర్మంబులందు విముఖులే. అందుచేత వారిని లొంగదీయుటకుఁ జోరత్వముగాని జూదముగాని యవలంభించినచో సులభమగు నుపాయము గలదు. అప్పుడు నేను నా విద్యాకౌశలమంతయు నుపయోగించి, ద్యూతమునందుఁ బ్రవేశించి యందు నేర్పరితనమును సంపాదించితిని. అందు మూలమున జూదగాండ్రెల్లరు నాకు మిత్రులైరి. పిదప వారి సాయముతోఁ జోరత్వమును నారంభించితిని. అందుఁ బ్రవీ

ణత నార్జించితిని. దానివలనఁ జోరులెల్లరు నన్ను నాయకునిగా నెన్నుకొనిరి. అందులో విమర్ధకుఁ డనువాఁడు నాకుఁ బరమ విశ్వాసపాత్రుఁడయ్యెను. అతఁడు కార్యకుశలుఁడు. ప్రతిభా వంతుఁ డగుటచేఁ దన్నగరమందలి విషయంబు లెప్పటి కప్పుడు నాకుఁ దెలియుచుండెను. అప్పురమునందు కుబేర మిత్రుఁడను నొక ధనికుఁడు గలఁడు. అతనికొక కుమార్తె గలదు. ఆమె ధనమిత్రుఁడను యువకునిఁ బెండ్లియాడ నిశ్చ యించుకొనెను. కాని కుబేరమిత్రుఁడు అర్ధపతియను నొక ధనవంతుని కొసంగ నిర్ణయించెను. ఈ విషయము విమర్ధకుని మూలమున నెఱింగితిని. ఒకనాఁడు నేను నా కుబేరమిత్రుని గృహమున కర్ధరాత్రిఁ జేరి పెరటియందుంటిని. అక్కడ నా కతని కుమార్తె గనఁబడెను. ఆరాత్రి దాను ప్రేమించిన ధన మిత్రునితోఁ గలసి యెచ్చటికైనను బోవ నిర్ణయించుకొని యతని రాకకై వేచియుండెను. అప్పుడామె నన్నుఁ జూచి భయపడెను. అప్పు డామెకడకుఁ జేరి యామెను భయపడవల దని చెప్పితిని. అందుకామె తన యుదంతమును జెప్పి సహాయ మొనరింపుమని నన్నుఁ బ్రార్థించెను. అంత నేనామెను దిన్నఁగా ధనమిత్రుని గృహమునకుఁ జేర్చితిని. అప్పు డాతఁ డంతయు గ్రహించి నాకుఁ దగిన గౌరవం బొసంగెను. అంత నాతనితో 'ధనగుప్తా! నాకుఁ జేతనగు నుపకారము మీ కెప్పుడును గలుగఁగలదు. కాన మీరు కుబేరదత్తునకు భయపడి యీ నగరమును వీడిపోకుఁడు. సమయముకొఱకు నోర్మి వహించిన కార్యములెల్ల ననుకూల పడఁగలవని చెప్పి, వారికడ శలవు గైకొని వచ్చితిని.

మరునాటినుండియు ధనమిత్రుఁడు నాకత్యంత మిత్రుఁ డయ్యెను. నేనాతని విఖ్యాతి యధికమగునట్లు ననేక విధములుగాఁ బ్రవాదులు ప్రచారమగునట్లు గావించితిని. నానాటి కతని యశము ప్రబలమగుచుండెను. ఒకనాటి రాత్రి నా పరివారముతో వారు మంజరి సహోదరియగు రాగమంజరి యింటికిఁ బోయితిని. కాని యా రాగమంజరిని గాంచి నప్పుడు నాకు రాగమే యుదయించి, చేయఁదలఁచుకొనిన కార్యక్రమము జరుగనీయకపోయితిని. అంత నామెయు నన్నుఁ జూచి యప్రయత్నముగా నామీఁద రాగము గలిగినట్టు లామె చేష్టలమూలమున గ్రహింపఁ గలిగితిని. పిదప నామెతోఁ మరునాఁడు వత్తునని పలికి తిరిగి నాపరివారముతో వచ్చితిని. నానాటికి రాకపోకల మూలముగా రాగమంజరికి నాకుఁ బ్రబలమైత్రి గలిగి, తుదకు వివాహమునకు దారిదీయు పరిస్థితులు గలిగినవి. కాని యీ వివాహమునకు కామమంజరి యంగీకరింపదనియు, నందుకనుకూల పరిస్థితులఁ గలిపింపఁ జేయుమని రాగమంజరి నన్నుఁ బ్రార్థించెను.

అంత నేను నాలోచించి, యొక బంగారు గారిడీ గిన్నెను గొని కామమంజరి గృహంబునకుఁ బోయితిని. ఆమె నన్నుఁ జూచి గౌరవించెను. అప్పుడు నా వృత్తాంతమును జెప్పి, వివాహమున కంగీకరింపుమని కోరితిని. అందుకుఁ బ్రతిఫలముగా నొక బంగారు గారడీ గిన్నెను బహూకరించితిని. దానినిఁ జూడఁగనే యెట్టకేలకు నామె సమ్మతించెను. పిదప నొక శుభముహూర్తంబున రాగమంజరిని వివాహమాడితిని. వివాహానంతరము నేను నా స్నేహితుల సహాయముతో అర్థ

పతిమీఁద నొక నిందను బ్రచారమును జేయించితిని. అతఁడు ధనమిత్రుని గృహమున నున్న బంగారుగిన్నె దొంగిలించి కామమంజరికి నిచ్చినాఁడని యొకవాదును బ్రచార మధికముగాఁగ జేసితిని. అందుకుఁ దోడుగా ధనమిత్రునిచే దన బంగారు గిన్నెను గూర్చి యటనటఁ బ్రచారంబు గావింపఁ జేసితిని. ఈ విషయము మహారాజుకుఁ దెలిసి విచారించి, యర్థపతి దోషియని నిర్ణయించి, యా నగరమునుండి వెడలునట్లు గావించెను.

బంగారుగిన్నె స్వర్ణ దానపరుల కమిత స్వర్ణమును నీయఁగలదని మఱియొక ప్రవాదును బ్రచారమును గావించితిని. కామమంజరి యదివిని, నిజమనివిశ్వసించి, తాను విటుల కడనుండి యార్జించిన బంగారమునెల్ల నందరికి దానమును గావింపఁజొచ్చినది. కాని ఫలిత మేమాత్రము లేకపోయినది. ఇంతలో నామె దొంగవస్తువును గైకొనినదను నేరముచేఁ గారాగృహమునందు నివసింపఁగలిగెను. పిదపఁ గుబేరదత్తు ధనమిత్రుని మంచితనమును గుఱితించి, యతనికిఁ దన కుమార్తె నొసంగి వివాహము గావింప నిశ్చయించుకొనెను. ఒక శుభముహూర్తంబున వారిఉభురకు వివాహము గావించెను. నాటినుండి వారు సుఖభోగంబు లనుభవింపఁ దొడఁగిరి.

ఇట్లుండ చండవర్మ, సింహవర్మపైకి హఠాత్తుగా దండెత్తి గెలిచి, యతని సుతయగు నంబాలికను గొనితెచ్చెనను విషయము నాకు నిన్న తెలిసినది. నే నా యంబాలిక వయోగుణ రూపంబుల మెచ్చి వివాహమాడ నిశ్చయించు

కొంటిని. అందుచేత నా మిత్రులను దోడుకొని, యెల్లో కోట యందుఁ బ్రవేశించి యతని సంహరించి యంబాలికను విడిపించి గైకొని పోవుచుండ నీ దర్శనమయినది. అన్నిటికన్న మిక్కిలి యానందము గూర్చినదనెను. ఈ కథను విని మిత్రులానందాశ్చర్య నిమగ్నులై 'మిత్రుఁడా ఇఁక నేమున్నది-శుభముహూర్తంబున అంబాలికను నీవు- అవంతీ సుందరిని రాజవాహనుఁడు వివాహమాడుటయే సశేష' మనిరి. అందుకు సింహవర్మ మిక్కిలి యానందించెను. అంత రాజవాహనుఁడానందపరవశుఁడై, ఉపహారవర్మను గాంచి, 'మిత్రుడా! నీ ధైర్యసాహసోపేతమైన కథనుగూడఁ జెప్పి మా కానందమును గూర్పు' మని చెప్పెను.

## ఉపహారవర్మ కథ

అంత నా ఉపహారవర్మ యమిత సంతోషంబుతోఁ దన కథ నిట్లు దెలుపఁ బ్రారంభించెను. రాజకుమారా! నేను నిన్ను వెదకుట కొకదిశ బయలుదేరితిని. అనేక నగరంబులందుఁ బరిశోధించితినిఁ గాని నీ యునికి తెలియదయ్యెను. పిదప మిథిలానగరమును సమీపించుచుండ నొక వృద్ధురాలు శోకించుచుండెను. అందుకుఁ గారణ మరయఁగోరి యామెను సమీపించితిని. నే నామెకడకుఁ జేరఁగనే యామె మఱింత బిగ్గరగా దుఃఖించుచుండెను. అంత నా ముసలిదానినిఁ గాంచి 'అమ్మా! యేల యిట్లు శోకింపుచుంటివి? నీకేదేని సహాయము కావలసియున్నచోఁ దప్పక గావింతును. యథేచ్ఛగా నాకుఁ దెలుపు' మని కోరితిని. అంత నాయవ్వ 'అయ్యో

యీ మిథిల రాజయిన ప్రహారవర్మ మగధేశుఁడయిన రాజహంసునకుఁ బరమ హితుఁడు. వారి రాణులయిన ప్రియంవదా వసుమతులు నా కత్యంతాప్తులయిన మిత్రులు. అందుచేత రాజహంసునకు మాళవరాజుతోఁ బోరుగలిగినప్పు డాతనికి సాయము గావింపఁ బాటలీపుత్రమున కరిగెను. అంత నా నృపతి మాళవరాజుతో నెదుర్కొని యోడి యరణ్యములఁ జేరి నివసింపఁ దొడఁగెను. ప్రహారవర్మకూడ నోడి యడవుల పాలై, మార్గమధ్యంబునఁ జోరులచేతఁ జిక్కెను. ఆ సమయంబున నాతని కుమారులు నా కడనుండిరి. వారుకూడా వారి చేతఁబడి' రని చెప్పి బిట్టుగా దుఃఖింపఁదొడఁగెను. అంతట నేనా కథను విని ప్రహారవర్మ, ప్రియంవదలు జననీ జనకులనియు, వారిప్పుడు విరోధుల బందీలుగా నున్నారనియు గ్రహించితిని. అప్పుడామెతో నా యుదంతమంతయుఁ దెలిపి. తల్లిదండ్రులను జెఱనుండి విడిపించుటకు నేను ప్రయత్నింపఁ గలననియు, శోకింపవలదనియు నుడివితిని.

అంత నా వృద్ధస్త్రీ నన్ను విశ్వసించి నగరంబులోనికిఁ దోడ్కొనిపోయెను. అప్పుడా మిథిలానగరమును వికటవర్మ పాలించుచుండెను. ఆతని భార్య కల్పసుందరి. ఆ రాణికడ నీ ముసలి కుమార్తె పుష్పరిక దాసీగాఁ బని చేయుచుండెను. అంత నా పుష్పరిక కడకు నన్నుఁ గొనిపోయి పరిచయమును గావించెను. నేనా పరిచయమును వినియోగించుకొని, యామె మూలమున కల్పసుందరికిని, వికటవర్మకును భేదాభిప్రాయంబు గలిగింప నిశ్చయించితిని. ఆ వృద్ధకాంత యీ విషయమునందు నాకు మిక్కిలి దోడ్పడెను. కాని

యట్లు గావించుట నాకు ధర్మయుక్తముగఁ గనఁబడలేదు. నా జననీ జనకులను విడిపించుట కంతకన్న నింకొక యుపాయము నాకుఁదోచలేదు. మంచిపనికై చేయు ప్రయత్నమునందు సాధనోపాయంబులందలి మంచి చెడులు ప్రధానం కాదు. దాని పరిణామమే ముఖ్యమని నాయాత్మ తెలిపినది. అందుచేత నేనా కార్యమును గావించుటకు దృఢ నిశ్చయమును గావించుకొంటిని.

నా జననీ జనకుల బంధ విముక్తికై రాజదంపతులకు భేదాభిప్రాయంబులను గల్పించుటకు నిశ్చయించుకొంటిని. పుష్పరిక సహాయము మూలముగ మహారాణి కల్పసుందరినిఁ గలిసికొన నవకాశము లభించినది. ఆమెకు నామీఁద సంపూర్ణాభిమానము గలుగునట్లు వర్తించితిని. ఒకనాఁ డామెతో సంభాషింపుచు, నా చిత్రమును నామెకొసంగి, 'యీ చిత్రమును రాజుకుఁజూపి, యిట్టి సుందర దేహము మీ కొనఁ గూర నంగీకరింతురా!' అని యడుగమనియు, నందుకాతఁ డంగీకరించినచో, మంత్రి సామంతాదులకీ చిత్రమును జూపి, యందుకై యొక యజ్ఞమును గావించుటకుఁ బ్రోత్సాహింపు' మని కోరితిని. అందుకమ్మహారాణి యంగీకరించెను. పిదప నామె యాచిత్రమును మహారాజుకుఁజూపి, నేను చెప్పినట్టుల నడిగెను. అప్పుడాతఁ డబ్బురపడి యట్టి దేహమును నాతఁడు వాంఛించి, యజ్ఞమును నొనరింప నిష్టపడెను. అందుకుఁగావలసిన సంభారంబులన్నియు సిద్ధపరుపమని మంత్రుల కాదేశించెను.

పిదప నమావాస్యనాటి రాత్రి యజ్ఞమును నా రాజు ప్రారంభించెను. నేనా సమయంబున గల్పసుందరి వేషంబును ధరించితిని. వికటవర్మ నన్ను కల్పసుందరియనియే నిజముగా భావించెను. అంత నేనాతనితో 'మహారాజా! యజ్ఞాంతము నందు మీరు దివ్యరూపమును ధరింపఁగలరు. అట్టి సమయం బున నన్ను నిజముగా మరువఁగల' రని మృదుమధురముగాఁ బలికితిని. అందుకాతఁడు మహారాణీ! యట్లెన్నటికినీ జరు గదు. నీవు నా ప్రేయసివికదా! నన్ను విశ్వసింపలేకపోయి తివా?' యనెను. 'అవును. అట్లెన్నటికిని జరుగదు' అని యని, 'మహారాజా! యజ్ఞాంతమగుచున్నది. మీ మనస్సునందున్న ముఖ్యరహస్యంబు లిట జెప్పినచో నవి సుఖాంతమగునుగదా' యంటిని. అందుకాతఁడు ప్రహారవర్మను వధించుటయు, పుండ్రదేశమును జయింపవలెననియు, నొక యరబ్బీ వర్తకుని దగ్గర నున్న యొక యమూల్యరత్నమును బరిగ్రహింపవలె ననియు, అనంతసిరుని సంహరింపవలెననియుఁ దెలిపెను. అంతట నేదో మిష బన్ని యావలకు వచ్చితిని పిదప నతఁడు యజ్ఞము పూర్తికాగానే విశ్రాంతిగృహంబునకు వచ్చుచుండ మధ్యన నతనినిఁ గత్తితోఁ బొడిచి మృతిఁజెందఁజేసితిని. పిదప నా ప్రేతమును జిత్రవధగావించి యగ్ని కాహుతి గావించి యథారూపముగా నీవలకు వచ్చితిని.

ప్రథమమున నా చిత్రమును గాంచినవారు, రూపము మారిపోయిన వికటవర్మగానే నన్ను భావించి యమిత భక్తి ప్రపత్తులతో సంచరింపఁ దొడంగిరి. నేను మరునాఁడు మా జననీ జనకుల బంధవిముక్తులఁ గావించి, వారికి యథా

పూర్వకముగా రాజ్యమును నప్పగించితిని. పిదప వారితో నీ విషయంబులం దెలిపి యానందచిత్తుల గావించితిని. ఇంతలో సింహవర్మ సహాయార్థము సైన్యముతో నిచ్చటికి వచ్చితిని. నా భాగ్యవశమున మీరు నా సహోదరుడు గనఁబడినారు. నాకెంతో సంతోషము గలిగినది. మీ కథలు కూడ వినవలెనని యమితకుతూహలముతో నుంటిని. అంతట రాజవాహనుఁ డానందించి యర్థపాలునిఁ గాంచి 'మిత్రమా! నీవు పోయిన దిశయందు జరిగిన విచిత్రముకూడ వినను త్సాహపడుచున్నారము. కానఁ జెప్పి మమ్మానందింపఁ జేయవలెనని యనెను. అంతట నర్థపాలుఁడు దనకథను నిట్లు వచియింపఁ దొడఁగెను.

## అర్థపాలుని కథ

ఉపహారవర్మ తనకథను చెప్పి మిత్రులనందఱ నానందవారాశిన నోలార్చెను. అంత రాజవాహనుఁ డర్థపాలుఁ గాంచి 'మిత్రుఁడా! నన్ను వెదకుటకై నీ వెందేఁగితివి? అందుగల విశేషంబులేమి?' యని ప్రశ్నించెను. అంత నతఁడు రాజనందనా! నిన్ను వెదకుట కనేక దేశంబులఁ దిరిగి, కడకు కాశీపట్టణము చేరుకొంటిని. అది నాకుఁ గ్రొత్త ప్రదేశము. అప్పురమున నొక బలశాలి గలఁడనియు, విని యతని కడకుఁ బోయితిని. అతఁడు నన్ను మిక్కిలి గౌరవించెను. పిదప నతని యుదంత మెల్ల నిట్లు నాకు వచియింపఁ దొడంగెను. తానొక నగరనాయకుని పుత్రుఁడననియు, దన పేరు పూర్ణభద్రుఁడనియు, నిప్పురమున నొక చోరకార్యమునందు

బట్టుబడినాఁడననియు, నందుమూలమునఁ దనకు మరణశిక్ష విధింపఁబడెననియు, దనను సంహరింపవచ్చిన మదకరిని నెది రింపఁ గలుగుటచే నృపతి ముఖ్యామాత్యుఁడయిన కామ పాలుఁడు దనను మెచ్చుకొని, దొంగతనము మానినచో నతఁడు దనను కాపాడఁగలనని వాగ్దానమును జేసినాఁ డనియు, నందుచేత నాటినుండి యా చోరవృత్తిని మాని నందున నతఁడు గౌరవించి తనకడ దనను నిలిపికొనినాఁడనియుఁ దెలిపెను. అంత నేను మిక్కిలి ముదమంది 'మహాశయా! మీ చరిత్రము మిక్కిలియభినందనీయము. మీతో నాకుఁగలిసికొను సదృష్టమును గూర్చి వచింపఁజాలను. కాని యింకొకటి మీ మూలమునఁ దెలిసికొనవలయునని కోరుచుంటిని. కామ పాలుని పూర్వ వృత్తాంతమును దెలియఁజేయ గోరెద' నని యర్థించితిని. అంత నాతఁ డెంతో హర్షించి, 'మిత్రుఁడా! నీవడిగిన విషయమును బూర్ణముగాఁ దెలిపెదను. పాటలీపుత్ర మంత్రియగు ధర్మపాలునకు సుమిత్రుఁడు, కామపాలుఁ డను నిరువురు నందనులు గలరు. ఆ కామపాలుఁడే యితఁడు. ఇతఁడు చిన్నవయస్సుననే యిల్లు విడిచి కాశికిఁ జేరుకొనినాఁడు. దైవవశమున కాశీరాజు చండసింహుని కుమార్తె కాంతి మతితోఁ గామపాలునికి సంబంధము గలిగినది. ఆ సంబంధము మూలమున నొక కుమారుఁ డామెకు జన్మించెను. ఆ రహస్య మితరులకు, దెలియఁగూడదను భయముచేఁ గామపాలుఁ డా బాలుని స్మశానమునందుఁ బడవైచెను. కాని యా రహస్యము మాత్రము దాగలేదు. చండవర్మకుఁ దెలియవచ్చెను. అంత

నతఁడు భయమునుచెంది, యొక యర్ధరాత్రి సమయంబున నర
ణ్యమునకుఁ బారిపోయెను.

అచట నొక కాంత విలపించుచుఁ గనఁబడెను. అతఁ
డామెకడకుఁ జేరి యామె యుదంతమును నరయఁగోరెను.
అప్పుడామె కాశీ శ్మశానములో నొక బాలుఁడు లభించె
ననియు, నతనినిఁదాను వసుమతికి సమర్పించితినని దెలిపెను.
ఆమె కాంతిమతికి జన్మాంతర స్నేహితురాలనియుఁగూడఁ
దెలిపెను. అంత నామె తానుగూడ నా భార్యననియే దెలిపి,
తనను స్వీకరింపుమని తెలిపెను. అట్లు స్వీకరింపనిచో దాను
మరణింపవలసి వచ్చుననియుఁ దెలిపెను. అంతనామె మృతిఁ
జెందినచో స్త్రీహత్యా పాదజము సంభవించునని భయపడి,
యామెను స్వీకరించితిని. పిదపఁ గొన్నిదినంబుల నామె
సహాయంబువలనఁ జండసింహుని జయించి, కామపాలుఁడు
కాంతిమతిని వివాహమాడెను. పిదపఁ జండసింహుఁడు కామ
పాలుని నీ రాజ్యమున కుత్తరాధికారిగా నియమించెను.

తదాదిగా కామపాలుఁడు కాశీరాజ్యమునకు మంత్రిగా
నుండెను. ఈవిషయమును నాకొక నాఁడాతఁడు స్వయముగాఁ
దెలిపెను. పిదప చండసింహుఁడు మరణించెను. కాని
యాతఁడు రాజుకాలేదు. సింహఘోషుఁడు రాజయ్యెను.
అంతట సింహఘోషుఁడు కామపాలుని బంధించి యురిశిక్ష
వైచెను. 'నేఁడా కామపాలునివధించుదిన'మని బిట్టుగా దుఃఖిం
చెను. అంత నేను మిక్కిలి లోన విచారించితిని. అతఁడు
చెప్పినదానినిఁబట్టి కామపాలుఁడు నా తండ్రియనియుఁ గాంతి
మతి నా తల్లియని గ్రహించితిని. వారిని బంధవిముక్తులఁ

గావించుటయే నా విద్యుక్తధర్మముగా భావించితిని. అంత నేనాతనితో నా యుదంతమును నెల్ల చెప్పి నాకు సహాయ మొసరింపుమని కోరితిని. అందుకతఁడు సంతోషించెను. వెంటనే నే నాతనిసాయము మూలమున ముందుగా నా జననియగు కాంతిమతిని దర్శించి యామెతో నా విషయ మును మొదటఁ జెప్పితిని. ఆమె యెంతయో సంతసించి నన్నుఁ గౌగలించుకొనినది. పిదప నేనామెను సహగమనమును గావిం చుటకు సిద్ధపడునట్లు నటింపమని చెప్పితిని. వధ్య ప్రదేశమున సహగమనమునకు నామెకని చితి నేర్పాటు గావించిరి. ఆమె నటకుఁ గొని తెచ్చిరి. పిదప నచ్చటకుఁ గామపాలునిఁ గూడఁ దెచ్చిరి. నేనంత నొక సర్పమును గొని యటకుఁ బోయితిని. సమయమును గాంచి నా సర్పమును మా తండ్రిగారిపై విసరి తిని. అంతట నా సర్పమతనిఁగఱచెను. రాజభటులు తత్తరు పాటుఁజెందిరి. వారు గావించుపనికి పూర్తిగా భగ్నమయ్యెను. నే నా సమయమునుగాంచి, మా తండ్రికడకుఁ జని, మందు పెట్టి, కొంతవరకు స్పృహలేక పడియుండి మరణించినవాని వలె నటించమని యాయనకుఁ దెలిపితిని. అందుకాయన సమ్మ తించినట్లు జేసెను.

రాజభటులు, ప్రజ లాతఁడు నిజముగా మరణించెనని నిశ్చయించి వారిని వదలిపోయిరి. అంతట నచ్చట నున్న పూర్ణభద్రుని సహాయముతో నా జననీ జనకులను సురక్షిత ప్రదేశమునకుఁ జేర్చితిని. అట వారు రహస్యముగా వసించు చుండిరి. ఇంతలో నేను సింహఘోషుని సోదరుని కుమార్తె యగు మణికర్ణికకు నొక ప్రమాదమును దప్పించుటచే నామె

నాయందు మిక్కిలి యనురాగము కలదయ్యెను. ఆమె సహాయము మూలముగా సింహఘోషుని యంతఃపురమునఁ బ్రవేశించి, యతనిని బంధించి యీ రాజ్యమును వశమును జేసికొంటిని. మఱల నా జనకుఁడగు కామపాలుని రాజుగాఁ జేసి వారి కానందమును గూర్చితిని. పిదప నొక శుభముహూర్తంబున మణికర్ణికకు నాకును వివాహమయ్యెను. ఇంతలో సింహవర్మకు సహాయార్థమై వచ్చిన మీ దర్శనమయ్యెను. నా యానందమునకు మేర లేదు' అనెను. అంత రాజవాహనుఁడు, మిత్రులీ కథ విని మిక్కిలి యానందించిరి. అంత రాజవాహనుఁడు 'మిత్రమా! నీవు చూపిన ప్రజ్ఞ యద్వితీయమైనది. కాని సింహఘోషుని బంధించుటలోఁ బొరపాటు గావించితివి. వెంటనే యతని విడిపించి నాకడకుఁ బంపు' మని తెలిపి, ప్రమతినిగాంచి 'మిత్రమా! నీకథను దెలిపి మాకెల్లర కానందమును గూర్పు' మని తెలిపెను. అంత నా ప్రమతి యిట్లు చెప్పందొడంగెను.

## ప్రమతి కథ

"రాజనందనా! నీకొఱకు బాధపడి నిన్ను ననేక ప్రదేశంబులఁ బరిశోధింపుచుఁ దుదకు వింధ్యాటవినిఁ జేరుకొంటిని. అందొక శిలాతలంబుపై విశ్రమించితిని. వెంటనే నాకు నిదురఁగలిగినది. అప్పుడు స్వప్నమున నాకొక శృంగారవతి కనఁబడినది. ఆమెను గాంచినంతనే నాకు రాగోదయమయినది. ఆమెకూడ నాయందుఁ బ్రేమఁ జూపినది. వెంటనే నాకు మెలకువ గలిగినది. అప్పుడు నాకెదురుగా నొక కాంత

నిలిచియుండెను. ఆమె నన్నతి పుత్రవాత్సల్యముతోఁ దీసి కౌఁగలించుకొని 'కుమారా! నీవు నన్నెఱుఁగవు. నేను యక్ష కాంతను. కామపాలుని యర్ధాంగినిని. ఒకానొక శాపము వలన నీ యరణ్యంబులందు సంచరింపుచుంటిని. నాకు శాపాంతమయినది. అందుచే మరల నాతని కడకుఁ బోవు చుంటిని. మధ్యమార్గంబున నిన్నుఁగాంచి, యిట కరుదెంచి తిని. ఇక్కడకు శ్రావస్తీనగరం బతి సమీపంబునఁ గలదు. నీ వటకుఁ బోయినచో నీకు శుభము లొనఁగూరఁగల' వని చెప్పి యామె యంతర్ధానమయ్యెను. అంత నే నాశ్చర్యమును జెంది, యామె చెప్పిన ప్రకారము శ్రావస్తికి బయలుదేరితిని. మధ్య మార్గంబున నాకొక బ్రాహ్మణుని స్నేహితము లభించెను. అతఁడు నా విషయమును విని, సమయము గలిగినప్పుడు నాకుఁ దాను దోడ్పడఁగలనని చెప్పి నన్ను శ్రావస్తీనగ రంబునకుఁ బంపి తన నిర్ణయప్రదేశమునకుం బోయినాఁడు.

అంతట నేను శ్రావస్తీ నగరంబునం బ్రవేశించితిని. అన్నగరము నాకుఁ గ్రొత్తయగుటచే నా నగర బహిర్భో ద్యానమునందు విశ్రమించితిని. అట్లు గొంతసేపు నిద్రించి మేలుకొనుసరికి, నా యెదుటనొకదాది తన చేతిలో నున్న చిత్రముతో నన్నుఁ బోల్చుచుండెను. అంత నే నామెను నడుగ నామె యా శ్రావస్తీనగర రాజకుమార్తె యగు నవమల్లికకు నంతరంగిక స్నేహితురాలననియుఁ దెలిపెను. అంత నేను నాకుఁ గలయందుఁ గనఁబడిన సుందరిని నామె కడనున్న చిత్రము ప్రక్క జిత్రించితిని. అంత నా చిత్ర మును గాంచి యామె యద్భుతాశ్చర్య మనస్కయై, యిది

నిజముగా నవమల్లిక చిత్రమని చెప్పి నా నైపుణ్యమున కామె మెచ్చుకొనెను. అంత నామె నన్ను నవమల్లికకుఁ బరిచయము గావించుటకుఁ బ్రయత్నింతుననియుఁ దెలిపెను. పిదప నాకడ శలవు గైకొనిపోయెను. అంత నేను మార్గమధ్యంబున హితుఁడగు న బ్రాహ్మణుని కడకుఁబోయి, జరిగినదెల్ల నాతనికిఁ జెప్పి సాయమొనరింపుమని కోరితిని. అంతనతఁడు నన్నుఁ దనకుమార్తెగా వేషమువేసి రాజదర్బారునకుఁగొనిపోయెను. పిదప నా బ్రాహ్మణుఁడు దాను కాశికిఁ బయనము గట్టుచున్నట్టును, నందాక తన కుమార్తెను రాణీవాసములో నుంచున ట్లేర్పాటు జేయుంపమని కోరెను. అందుకు నృపాలుఁ డంగీకరించి, నన్ను నంతఃపురమునకుఁ బంపెను. నేనా నవమల్లికతో, యథేచ్ఛగా సుఖింపుచుఁ గొన్నాళ్ళు వసించితిని. పిదపఁ గొన్నాళ్ళ కెవరికిఁ దెలుపకుండ నా బ్రాహ్మణుని గృహంబునకు వచ్చితిని. అంత నా బ్రాహ్మణుఁడు నాయథారూపంబుగ నన్నుఁ గొనిపోయి 'మహారాజా! మీకృప వలన నా యాత్ర నిరాటంకముగా సాగినది. ఆ సందర్భమున దైవవశమున నితఁడు నాకు లభించినాఁడు. ఇతనికి నాకుమార్తె నొసఁగి పెండ్లిగావింప నిశ్చయించితి' ననెను. అంత నా రాజు సమ్మతించి బ్రాహ్మణ పుత్రికను దోడితెమ్మని యంతఃపురమునకు సేవకులను బంపెను.

అట నా కుమార్తె యెందుశోధించినను గనఁబడక, నా వార్తను మహారాజునకుఁ దెలియఁ జేసిరి. రాజామాటవిని యేమియుఁదోచక మిన్నకుండెను. అదికని బ్రాహ్మణుఁడు రాజా! యిప్పుడు గడచిన దానికిఁ జింతింపఁ బనిలేదు. నా

కీమార్తె యందే పోయి యుండును. ఈ సద్గుణమూర్తికిఁ బత్నియగు భాగ్యము నా పుత్రికకు లభింపలేదు. ఇంకేమి చేయఁగలను? కావున నావిజ్ఞప్తిని మన్నించి నీకుమార్తెయగు నవమల్లికను నితనికొసంగి వివాహ మొనరింపుము. నవమల్లికకు నీతఁడు దగిన వరుఁడు. ఇంక నాలోచింపక కర్తవ్యమును నిర్వహించినవాఁడగుదువు' అని చెప్పెను. అంత నా నృపాలుఁడు వేరు గత్యంతరం లేక, మహారాణితోను, నవమల్లికతోను నాలోచించి, యొక శుభముహూర్తంబున నాకును నవమల్లికకును వివాహ మొనరించెను. నాటినుండి నవమల్లిక నేను నపరిమిత సౌఖ్యంబులఁ దేలుచున్నను, నీ విషయము తలంపునకు వచ్చినప్పుడల్లా తీరని విచారము గలుగుచుండును. పిదప నవమల్లికతోపాటు నా రాజ్యాధిపత్యముకూడ నాకే లభించెను.

ఇంతలో సింహవర్మ వృత్తాంతము విని సహాయార్థము సైన్యసమేతముగా వచ్చి మిమ్మందఱను జూచు భాగ్యము గలిగినదని వారి నెల్లరను కౌఁగలించుకొనెను. అంత రాజవాహనుఁడు 'ప్రమతీ! నీవు చాల నదృష్టశాలివి. తలవని తలంపుగా, రాజ్యమును, భార్యను బొందితి' వని మెచ్చుచు మిత్రగుప్త మంత్రగుప్తులను జూచి, మీ వృత్తాంతములను గూడ చెప్పి మమ్మానందపఱుపుమని కోరెను. అంతట మిత్రగుప్తుఁడు దన స్నేహితుఁడయిన రాజవాహనుఁడు కోరినదే తడువుగాఁ దనకథను నిట్లు చెప్పఁ బ్రారంభించెను.

# చిత్రగుప్తుని కథ

రాజనందనా! నిన్ను వెదుకుచు ననేక ప్రదేశంబులఁ దిరిగితిని. కాని యెక్కడ నీజాడ గనఁబడలేదు. కడకు దామ విస్తమను నగరమును జేరుకొంటిని. అప్పట్టణమునెల్ల తిరిగి, యొక యుద్యానమునందుఁ జేరితిని. అచట నొకఁ డమిత విచార వదనముతో నింపుసొంపు వెలయునట్లు వీణవాయించు చుండెను. నేనాతనికడకు జేరితిని. అంత నాతనినిఁ జూచి 'అయ్యా! మీరు మధురాతి మధురముగా వీణ వాయించు చున్నారు. ఈ విద్యయందలి శక్తి మీ కమోఘముగా నున్నది. కాని మీ రే కారణంబుననో విచార వదనులయి యున్నారు. వినవలతునేనిఁ దెలుపఁగోరుచుంటి' నన నాతండు 'అయ్యా! ఈ దేశమును దుంగధన్వుఁడను రాజు పరిపాలించు చుండెను. అతనికి సంతతి లేదు. అందుచేత నాతఁడీ సమీపం బున వెలసియున్న యొక దేవతను నుపాశించెను. ఆ దేవత కరుణించి రాజు స్వప్నమునందుఁ గనఁబడి 'రాజా! నీకచిర కాలంబుననే యొక కుమార్తెయు, నొకకుమారుఁడు జన్మింపఁ గలరు. కాని నీ కుమార్తెకు నేడుసంవత్సరములు ప్రాయము వచ్చునందాఁక నన్ను సేవింపవలయు'నని చెప్పెను. అంత నా నృపతి మేల్కాంచి, యమితానందమును బొంది తన దేవేరికీ విషయమును దెలియఁ జేసెను.

అంత కొన్నాళ్ళకు దేవత చెప్పినట్లుగా మా రాజునకు సంతతి గలిగెను. అంతట నా నృపాలుఁ డమితానందంబును జెంది, రాజ్యంబెల్ల నుత్సవంబులు జేయించి, కుమార్తెకు కంను

కవతి యనియు, కుమారునకు భీమధన్వుఁ డనియు నామంబిడి యల్లారుముద్దుగాఁ బెంచుచుండెను అంత, వా రుభయులు షోడశకళా చంద్రునివలె, సమస్తవిద్యలం దాఁటితేరి నవ యవ్వన ప్రాయులైరి. కందుకవతికి చంద్రసేన యను నొక స్నేహితురాలుగలదు. నేనామెను ప్రేమించితిని. నన్నాచంద్ర సేన గాఢముగాఁ ప్రేమించెను. కాని కందుకవతి సోదరుఁడగు భీమధన్వుఁడుకూడఁ ప్రేమింపుచుండెను. అతఁడు యువరాజు. అందుమూలమున మా వివాహమున కేమైన నాటంకముజరుగునా యని చింతఁబొందుచుంటి' ననెను. ఇంతలో నాతఁడు చెప్పిన చంద్రసేన యచ్చటకు వచ్చెను. వారి పరస్పర రాగమును గాంచి వారికెట్లయిన సాయంబు గావింప నిశ్చయించుకొంటిని. ఆ చంద్రసేన దేవాలయమునందు రాజకుమారి నాట్యము గావింపఁ బోవుచున్నదని తెల్పెను. అంత నేనా నాట్యమును దిలకింప నుత్సాహపడి వారితోఁగూడ నటకుఁ బోయితిని. రాజకుమారి సౌందర్యమును జూచి, నేను నతి ముగ్ధుఁడ నయితిని. నన్నా రాజకుమారి యప్రయత్నముగాఁ జూచి, మనస్సునందు రాగము నిలిపికొనెను. ఈ విషయము భీమధన్వుఁడు గాంచుచునే యుండెను.

అనంతర మా రాజపుత్రికఁ గొంతసేపు కందుక క్రీడ నాడి, చెలికత్తెలతోఁగూడి యంతఃపురమునకుఁ బోయెను. భీమధన్వుఁడు మనస్సునం దేదియో యాలోచించి, నన్ను బంధించి సముద్రమునఁ బడవేయమని సేవకుల కాజ్ఞాపించెను. అతఁ డానతిచ్చిన తడవుగా సేవకులు నన్ను బంధించి సముద్రమునఁ బారవైచిరి. కాని విధి నా కనుకూలుఁ డగుటచే

గొందఱు నావికుల మూలమున బ్రతికితిని. ఇంతలో నొక యోడ మా యోడపైకి వచ్చినది. నా పరాక్రమమును జూపి మమ్మెదుర్కొనిన ఓడలోనివారిని జయించి బంధించితిని. ఆ ఓడ నాయకుఁడు భీమధన్వుఁడే. కొలదిసేపటికి బందీలతో మా యోడ యొక ద్వీపమునకుఁ జేరుకొనెను.

నేనట్లు నా నావికులను గాపాడినందుకు వారు నన్ను గౌరవముగాఁ జూడఁదొడఁగిరి. కాని యొడ్డున నేను చేరునప్పటి కొక బ్రహ్మరాక్షసుఁడు నన్నడ్డగించి కొన్ని ప్రశ్నలను నడుగఁజొచ్చెను. వానికి నాకీ విధముగా సంభాషణ జరిగినది.

రా : లోకంబునందుఁ గ్రూరతరమయిన దేది ?

నే : స్త్రీ హృదయము.

రా : గృహస్థుఁడు వాంఛించునదేమి ?

నే : సుగుణవతియైన సతిని.

రా : కామమనఁగా నేమి ?

నే : మనోవికారము.

రా : ఎంతటి బలవంతమైన కార్యమును సాధించునదేది ?

నే : బుద్ధిబలము.

అని నేను వచించిన సమాధానంబులా బ్రహ్మరాక్షసునకు నచ్చి నన్ను మెచ్చెను. ఇంతలో నొక రాక్షసుండొక కాంతను గొనిపోవుట గాంచితిని. అది గాంచి కష్టదశయందున్న యా కాంతను రక్షింపుమని రాక్షసుని గోరితిని. అతఁడు నా కోరిక నంగీకరించి, యా రాక్షసుని నెదురించి,

పోరెను. కాని యా పోరాటమునం దిరువురు మృతిని జెందిరి. అంత నామె నాకడకు వచ్చి నాకు నమస్కరించెను. ఆమె కందుకవతియే. నేనుఁ బ్రేమించిన కందుకవతియే. ఆమె దనను రక్షించినందుకు ననేక కృతజ్ఞతలను దెలిపెను.

అంత నేనామెను గైకొని, యోడనెక్కించి దామలిప్త పురమునకుఁ జేరుకొంటిని. అట దమపుత్రిక గానఁబడ లేదని విరక్తిఁజెంది రాజదంపతులు ప్రాయోపవేశమునకు సన్నద్ధు లగుచుండిరి. ఇంతలో మేమచ్చటికిఁ జేరితిమి. నన్ను, కందుక వతినిఁగాంచి వారు పరమానందభరితులైరి. కందుకవతి జరి గినదెల్ల తల్లిదండ్రులకుఁ జెప్పెను. అంతవారు నేను గావిం చిన యుపకారమునకుఁ దమకుమార్తెయగు కందుకవతిని నొసఁగి యొక శుభముహూర్తంబునఁ బెండ్లిగావించిరి. పిదప నా రాజ్యమును నాకే సంక్రమింపఁజేసిరి. నేను రాజ్యముతో పాటు కందుకవతితో ననేక సౌఖ్యంబులను బొందుచుంటినిఁ గాని నిన్నుఁ దలంచినప్పుడెల్లా యపరిమిత ఖేదమును బొందు చుంటిని. అంతకుముందు చంద్రసేనను నా వైనకుని కొసంగి వివాహమును గావించితిని.

ఇంతలో సింహవర్మ సహాయార్థమయి, సైన్యమును గొని యడకు రాగానే దైవసహాయమున మీ దర్శన సమాగ మములు లభించినవి. నాకు బ్రహ్మానందము గలిగినదని మిత్ర గుప్తుడు దన కథను జెప్పెను.

# మంత్రగుప్తుని కథ

"మిత్రమా! నీవట్లు పోయిన పిదప నీ కొఱకుఁ జాలకాలము వేచియుంటిమి. కాని నీ జాడ యొకింత గానఁబడలేదు. అందుచేత నొక్కొక్కర మొక్కొక్క దిశకుఁబోయితిమి. నేను తూర్పుదిశకుఁ బోవుచు మార్గమధ్యంబున ననేక ప్రదేశంబులందు నిన్ను వెదకుచుఁ గడకుఁ గళింగదేశమును జేరుకొంటిని. అక్కడ నొక శ్మశానమునందు విశ్రమించితిని. నేను మరల లేచునప్పటికి నొకసేవకుఁ డొకదాసి నాకుఁ గొంతదూరమునఁ గనఁబడిరి. వారట్లు పోవుటకుఁ గారణమరయఁ దలంచి, వారి ననుసరించితిని. వారు అఘోరసంధీయను నొకసాధువును గూర్చి మాట్లాడుకొనుచు నటనున్న యొక శిథిల దేవాలయమునందుఁ ప్రవేశించిరి. నేను వారికిఁ గనిపింపక వెన్నాడి అక్కడకుఁ జేరితిని. అచ్చట సాధువు అభిచార హోమములను గావింపుచుండెను. పిదప నాతఁడు సేవకునిఁ జూచి 'కళింగదేశ రాకుమారినిఁ దోడ్కొనిరమ్ము' మని చెప్పెను. అంత నా నౌకరా రాజకన్యనుదెచ్చి యాసాధు ముందిడెను. పాపమా కన్య యమిత భయకంపిత చిత్తముతో నుండెను. దీనవదనయై దుఃఖింపుచుండెను. వెంటనే యామె ను కాళికి బలినొసంగుటకు సన్నద్ధపడుచుండెను. అంతట నేను నాలస్యమును గావింపక, వెనుకనుండి వానిమీదికుఱికి కత్తితో వాని కుత్తుక నఱికితిని. ఆ కన్యక నా సాహసమునకు నాసహాయమున కచ్చెరుపడి చూచుచుండెను. అంత నా సేవకుఁడు నాకు నమస్కరించి 'మహాత్మా మీ శక్తిసామర్థ్యము లద్భుత

ములు. ఈ క్రూర సాధువును సంహరించి లోకోపకారమును గావించితివి. నేను నీ సాహసమునకు మెచ్చితిని. నేనొక రాక్షసుఁడను. కాని కొన్ని కారణంబుల మూలంబుగ వీని ననుసరింపవలసి వచ్చినది. కాన నింకనుండి నీవేది కోరెదవో యది కావింతు'నని తెలిపెను. అందుకు ముదమంది నేను 'ఓయీ! ముందీ కన్యను రాజాంతఃపురమునకుఁ జేర్పు'మని యంటిని. కాని యీ రాజకుమారి నాకు నమస్కారములొన రించి 'మహాత్మా! ఆపత్సమయంబున వచ్చి నన్నుద్ధరించిన దైవస్వరూపులు. అట్టి మిమ్ము వదలి నేను నొక్కదానను బోవుటకు సమ్మతించను. నాయందుఁ గనికరించి మీరుకూడ నాతోరం'డని యతి దీనంబుగాఁ గోరెను. అంత నేను సమ్మ తించితిని. అతఁడు క్షణములో మమ్మచటకుఁ జేర్చెను. అటఁ రాజదంపతులు దమకుమార్తె కనఁబడకుండుటవలన మిత చింతాసాగరమునందు మునిఁగి యుండిరి. అట్టి సమయంబున మమ్ముఁగాంచి వారు మిక్కిలి యానందించిరి. అంత నా రాజ కన్యక నన్నుఁజూపి జరిగిన వృత్తాంతమును జెప్పెను. అంత వారు నన్నుఁ గౌఁగలించుకొని యందుండుమని నన్ను బ్రతి మాలిరి. నేనట సుఖముగా కొన్నాళ్ళు రాజు గౌరవముల నందుకొనుచు, రాజకుమారి ప్రేమ సముద్రమున నోలలాడు చుంటిని.

అట్లుండ హఠాత్తుగా నాంధ్రదేశపు రాజు కళింగ దేశముపై దండెత్తెను. తలవని తలంపుగా నిల్లు జరుగుటచే కళింగ నృపతి యోడిపోయెను. అంత కళింగదేశ మాంధ్ర

రాజుల స్వాధీనమయ్యెను. అంత నా నృపతి, రాజకుటుంబ మును బంధించి యాంధ్రరాజధానికిఁ గొనిపోయెను. నేను నేమి కావించుటకుఁ దోఁచక కళింగ రాజు కుమారీ వియో గంబున నున్మత్తునివలెఁ దిరుగుచుఁ గొన్నాళ్ళ కాంధ్రరాజ ధానికిఁ జేరుకొంటిని. అంతట నొక సత్రమునందు విడిది గావించితిని. ఇంట్లుండ నా నృపాలుఁడు కళింగ రాజకన్యను వివాహమాడ నెంచినాఁడనియు, నామెకొక భూత మావే శించుట వివాహమున కాటంకమును జేయుచున్నదనియుఁ నా సత్రమున దెలిసికొంటిని. అదియే తగిన తరుణంబని భావించి, యాలోచించితిని.

నేనొక యోగివేషమును ధరించి కొంతమంది శిష్యు లను వెంటఁ బెట్టుకొని రాజసన్నిధికిఁ బోయి, నేనొక యోగి ననియు, ననేకసంవత్సరములు దపస్సుగావించి వచ్చితిననియుఁ బ్రజోప యోగార్థము, బయలుదేరితిననియు మార్గమధ్య మున నీవు వివాహమాడ నెంచిన కనకలేఖకు భూతమేదో యావేశించిననియుఁ దెలిసికొని వచ్చితిననియు జెప్పెను. అందుకా నృపాలకుఁడానందించి నన్నా రాజకుమార్తెకు భూత నివారణ గావింపుమని చెప్పెను నేనందుకు సమ్మతించి, రెండు నెల లతనికి దీక్షలో మునిఁగి పిదప, నూరుబయటనున్న తటా కమునందు స్నానమును గావించి రమ్మని చెప్పితిని. అట్లు గావించిన రాజకుమారి కావేశించిన భూతము పరుగిడి నిన్ను వివాహమాడఁ గలదని పలికితిని. అందుకాతఁడు విశ్వసించి దీక్ష వహించెను.

నేను నారాజు దేశాంతరమును బోయినట్లొక ప్రవాదును ప్రబలమును గావించితిని. పిదప దీక్షముగిసిన మరునాడు నేనా తటాకము కడకుఁబోయి దాగుకొని యుంటిని. రాజు స్నానమాడుటకందు వచ్చెను. పిదప నతఁడు స్నానమాడుటకందుమునిఁగెను. అదే తరుణముగా భావించి నేను వెంటనే యందు దుమికి యతని కంఠమును నులిపి సంహరించి నేను బయటకు వచ్చితిని. మారువేషముతో వచ్చిన నన్ను రాజుగా మంత్రులెంచి గౌరవముగా నన్నుఁ దోడ్కొని పోయిరి. అదే దినమున కళింగ దంపతులను గనక లేఖను బంధవిముక్తులను గావించితిని. నేనా వారలకు రహస్యముగా నా యుదంతంబెల్ల వచించితిని. వారు మిక్కిలి యానందించిరి. పిదప నొక శుభముహూర్తంబున మహావైభవంబున కనక లేఖను వివాహమాడితిని. తరువాత కళింగదేశమునకు, నాంధ్ర దేశమునకు నధిపతినయితిని. కనకవల్లితోఁబాటు రెండు రాజ్యంబులను బరిపాలింపుచు సుఖంబులను దేలుచుంటిని. ఇంతలో సింహవర్మసహాయార్థంబయి, యిటకు వచ్చి మిమ్ముం దఱి జూడఁగలిగితిని. అన్నిటికన్న నదియే మిక్కిలి బ్రహ్మానందంబు గూర్చినదని మిత్రగుప్తుఁడు చెప్పెను. మిత్రు లా కథను విని మిక్కిలి యానందించిరి. రాజవాహనుఁడు విశ్రుతా! నీ వొక్కడవే మిగిలితివి. ఇఁక నీ కథనుగూడఁ జెప్పి మా కానందమును గూర్పుమని కోరెను. అంత నా విశ్రుతుఁడు దనకథను వారల కిట్లు చెప్పఁ బ్రారంభించెను.

# విశ్రుతుని కథ

రాజకుమారా! నిన్ను ననేక ప్రదేశంబుల వెదు
కుచుఁ జివరకు వింధ్యాటవికిఁ జేరితిని. అట నొక నూతిలో డిగి
బయటకు వచ్చుటకు వీలుపడక బాధపడుచున్న నొక ముదు
సలివానిని, వానికొఱకై విలపించుచున్న యొక బాలకునిఁ
గాంచితిని. అంతట నేను నా ముదుసలికిఁ జేయూఁత నొసఁగి
రక్షించితిని. అంత నతఁ డానందించి తన యుదంతమును
నాతో నిట్లు వచియింపఁ దొడఁగెను. 'అయ్యా! యీ
బాలుఁడు విదర్భరాజగు అనంతవర్మ తనయుఁడు. అనంతవర్మ
భోగలాలసుఁడై యుండఁగా, విరోధిరాజైన అశ్మకిరాజాతని
నెదురించి సంహరించెను. మహారాణి, రాకుమార్తె మంజు
వాదిని నాతనికి బందీలయిరి. విశ్వాసపాత్రుఁడయిన యొక
వృద్ధమంత్రి యీ బాలుని నెట్లో తప్పించి నాకప్పగించి సుర
క్షిత స్థానమునకుఁ జేర్పుమని కోరెను. అందుకు నేను సమ్మ
తించి యీ కార్యభారమును శిరముపైఁ దాల్చితిని. కాన
నిందు నాకు మీరు సాయమును గావింపుఁ' డని ప్రార్థించెను.
నేను నందుకు సమ్మతించి సహాయ మొనరింతునని వాగ్దాన
మును గావించితిని.

ఇంతలో నొక కలకలము మాకు వినిపించెను. నేను
వారి నందుండ నియమించి, యటకుఁ బోయితిని. చండవర్మ
సోదరుఁడు ప్రచండవర్మ విదర్భకు సైన్యసమేతుఁడయి పోవు
చున్నట్లును, అనంతవర్మ సహోదరుఁడు మిత్రవర్మ విదర్భను
నాక్రమించినట్లు గూడఁ దెలిసికొంటిని. అంతట నేను నచ్చటి

నివాసులుగా నున్న కొంతమంది గోయవారిని సైన్యముగాఁ జేసికొని విదర్భకుఁ జేరితిని. అంతట నేను రహస్యముగా కోటయందుఁ బ్రవేశించి సమయమును గనిపెట్టి మిత్రవర్మను, ప్రహారవర్మను సంహరించితిని. పిదప నా రాణికి నా మె కుమారుని నప్పఁజెప్పి నా విషయమును దెలియఁజేసితిని. పిదప వృద్ధమంత్రినిఁ గలిసికొని నావిషయమునుఁ జెప్పి, యాతని సహాయము మూలముగా నశ్మకరాజును నెదురించి సంహరించితిని. అంతట నేను శత్రునిర్మూలనమును గావించి, అనంతవర్మ కుమారుఁడగు భాస్కరవర్మను రాజుఁ గావించితిని. ఇట్లు గావించినందులకు రాణి మనంబలరి తన కుమార్తె యగు మంజువాదినిని నాకిచ్చి వివాహమును గావించెను. భాస్కరవర్మ బాలుఁడగుటచే నతనికిఁ జేదోడుగా నుండి రాజ్య రక్షణభారమును వహించితిని. ఇంతలో సింహవర్మకు సహాయార్థమై వచ్చి మీ దర్శనభాగ్యమును బొందఁగలిగితి' నని సుశ్రుతుఁడు దన కథను ముగించెను.

స్నేహితులందఱొకర్నిమించి యొకరు తమ ప్రజ్ఞా ప్రభావంబులు గలిగియుండి దేశాధిపతులయి యుండుటవలన వారి కథలు విని రాజలోకము మిక్కిలి యానందించెను. ఈలోపున మాళవరాజయిన దారువర్మ మరల వచ్చి, పుష్పోద్భవుని బంధించినట్లు వార్త మిత్రులందరికిఁ దెలిసియూ దేశంబునఁ దమ సైన్యంబులతోఁ గోట ముట్టడించిరి. అంతట దారువర్మ గర్వమంతరించి, వారితో మైత్రి గావించుటకు సిద్ధపడెను. అంతట నాతఁడు దన కుమార్తెయగు నవంతీ

సుందరిని నొసఁగి మహా వైభవముగా వివాహమును గావించెను. పిదప మిత్రులెల్లరందుఁగలిసికొని మిక్కిలి యానంద ముతోఁగాలమును గడిపిరి.

కుమారులందఱు మాళవదేశంబునఁ జేరిరని చార ముఖంబున రాజహంసుఁ డాలించి తనయొద్దకు రమ్మని కబురు జేసెను. అంతట వారెల్లరు తమ తమ భార్యలతో జననీ జనకులతో సచ్చటికిఁ జేరి గురువయిన వామదేవుని దర్శించి తమ తమ వృత్తాంతంబులం జెప్పి. యానందింపఁ జేసి తదాశీర్వాదములను బొందిరి. పిదప రాజహంసునికి మిక్కిలి సంతోషమును గూర్చిరి. పిదప రాజకుమారు లెల్లరు సేనాసమేతులయి మగధపై దండెత్తిరి. అంతట నీ వార్తను విని విరోధిరాజులు మగధను వీడిపోయిరి. మగధ సులభముగా స్వాధీనమయ్యెను.

ఒక శుభముహూర్తంబున రాజహంసుఁడు సపరివార ముగా మగధకుఁజని. యథారీతిగాఁ దనరాజ్యమును బాలింపఁ దొడగెను. యువరాజుగా రాజహంసుని గావించెను. మిత్రు లెల్లరు వారి వారి రాజ్యములను సుఖవంతముగా నేలుచు, మగధ కండగా నిలిచిరి. పిదప రాజహంసుఁడు వారి సహా యము మూలమున రాజసూయ యాగమును గావించెను.

ఆనాటి ప్రజలు రామరాజ్యంబునుగూడ మఱచిరి.

శుభం!

# విజ్ఞాన వికాసాలకు

చదవండి ! చదివించండి !!

## పంచతంత్ర కథామాల

| | | | |
|---|---|---|---|
| మిత్రలాభము | 1 భా. | .... | రు 0 63 |
| మిత్రభేదము | 2 భా. | .... | 0 63 |
| విగ్రహము | 3 భా. | .... | 0 63 |
| సంధి | 4 భా. | .... | 0 63 |
| అసంప్రేక్ష్య కారిత్యం | 5 భా. | .... | [illegible] |

## బాల కథామాల

| | | | |
|---|---|---|---|
| ఎవరు గొప్ప | 1 భా. | .... | 0 63 |
| సిందుబాదు | 2 భా. | .... | 0 63 |
| దేవుడి వరాలు | 3 భా. | .... | 0 63 |
| బుడుంగ్ | 4 భా. | .... | 0 63 |
| మాంత్రికుడు | 5 భా. | .... | 0 63 |

జయంతి పబ్లికేషన్సు, విజయవాడ-2.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B135 |
| పుస్తకం పేరు | దశకుమార చరిత్ర |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 71 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | Ci, BCi, 66 |
| లేవి పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |